# మేరుతంత్ర సంగ్రహము

(ప్రాచీన తంత్రశాస్త్ర సర్వస్వమ్)

సాహిత్య విద్యాప్రవీణ; తర్క - వేదాంత ధురీణ
జ్యోతిష - తంత్ర పారీణ

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్
MA. సంస్కృతం

పబ్లిషర్స్ :
ఫోన్ : 2465253
గొల్లపూడి వీరాస్వామి సన్
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్
కోటగుమ్మం - రాజమండ్రి- 533 101

 2007 వెల : 35-00

## మేరుతంత్ర సంగ్రహము

రచన :
మేడవరపు సంపత్ కుమార్, M.A. సంస్కృతం

ప్రథమ ముద్రణ :
నవంబర్, 2007

ముఖచిత్రాలు :
కె.బి. క్రియేషన్స్
రాజమండ్రి - 533 103., ఫోన్ : 2464707

గ్రంథ ముద్రణ :
మహేశ్వరీ ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స
రాజమండ్రి - 533 104., ఫోన్ : 2478594

ముఖచిత్ర ముద్రణ :
ఈశ్వర్ గ్రాఫిక్స్
రాజమండ్రి - 533 103., ఫోన్ : 2461532

# ఒక్కమాట

సాధకులకు నమస్కారము. అతీంద్రియ జ్ఞాన సముపార్జనకు ఎన్నో నియమాలు అవసరం. వీటిని వివరించే తంత్రశాస్త్ర సాహిత్యం, సంస్కృత భాషలో అపారంగా ఉన్నది. దానిని తెలుగులో తెలియ జెప్పాలనే తపనతో "తాంత్రిక గ్రంథావళి" శీర్షికన ఆ పుస్తకములు ప్రచురించాలని సంకల్పించాను. మొదటిగా "మేరుతంత్రం" అందజేస్తున్నాను. పుస్తకాలు, కాశీ, కలకత్తా, జోధ్‌పూర్, త్రివేండ్రం, మద్రాసు, నేపాల్ మొదలగుచోట్ల తాళపత్ర గ్రంథాలయాల్లో ఉన్నాయి.

కొన్ని 40 - సం॥ల క్రితం, కాశ్మీర్‌లోనూ, బొంబాయి కాశీ నగరాల్లో సంస్కృతంలోనూ, కొన్ని హిందీ అనువాదంలోనూ ప్రచురించ బడ్డాయి. అవన్నీ సేకరించి తెలుగులో అనువదించి ప్రచురించా లంటే, ఎన్నో వ్యయ, ప్రయాసలు పొందాలి. అయినా పరమేశ్వరాను గ్రహంవల్ల ఆశక్తి సామర్థ్యాలు నాకు లభిస్తాయని ఆశిస్తున్నాను.

భవదీయ

కాకినాడ

11-11-1998

మేడవరపు సంపత్ కుమార్

# విషయసూచిక

# తంత్రపీఠము

"నవలక్షం తు తాంత్రికం" – అని వారాహీ తంత్రంలో చెప్పబడింది. విస్తృతంగా వ్యాపించి లోకహితం కొరకు, తంత్రశాస్త్రం 9 లక్షల శ్లోకాలలో నిబద్ధమై ఉంది. అసలు 'తంత్రం' అంటే ఏమిటి అని, పరిశీలిస్తే – "తమసః త్నాయతే యస్తు స తంత్రః" అనగా చీకటినుండి వెలుగుకు ఉన్ముఖము చేయు విద్యయే తంత్రశాస్త్రం. మనస్సును ఊర్ధ్వముఖముచేసి ఉన్నత వృత్తుల శక్తివృద్ధిని ఇచ్చు శబ్ద శక్తి మంత్రము.

**శ్లో॥ తనోతి విపులానర్ధాన్ తత్వమంత్ర సమాశ్రితాన్ ।**
**త్రాణం చకురుతే పుంసాం తేనతంత్రమితిస్మృతమ్ ॥**

**తా :** విపులార్ధములు తెలియజెప్పేది, మంత్రము ద్వారా ఆశ్రయించినవారిని రక్షించేది, తత్వజ్ఞానం కలిగించేది తంత్రశాస్త్రము. ఆగమం అంటే.

**శ్లో॥ ఆగతం శివ వక్త్రేభ్యః గతంచ గిరిజాననే ।**
**మతంచ వాసుదేవస్య తస్మాదాగమముచ్యతే ॥**



**తా :** శివుని 5ముఖముల నుండి (ఆగతం) వచ్చినది. గిరిజముఖమును పొందినది. (గతం) విష్ణువు అంగీకరించినది. (మతం) ఆగమంఅని పిలువబడుచున్నది. నిగమం అంటే పార్వతి ముఖమునుండి నిర్గమించి శివునిపొంది, విష్ణుసమ్మతమైనదని, కొందరు అంటారు. కాని ఇది ప్రాచీనులకు సమ్మతం కాదు, నిగమం అంటే వేదం అని, వైదిక కర్మలను నిగమంచేత పిలుస్తారని తంత్ర పండితాభిప్రాయం.

శ్రీవిద్యోపాసనలో శ్రీ చక్రార్చన, మంత్రజపం, (పంచదశి, లేదా–షోడశి) పురశ్చరణ చేస్తారు. సమయాచారులు మానసిక భావనతో చక్రార్చనచేస్తే, కులాచారం పాటించు కౌళులు చక్రార్చనలో 'ప్రత్యక్షయోని పూజ' చేస్తారు. ఈ విధానం పరాజ్ఞానబుద్ధితోనే చేస్తారుగాని, కామతృప్తికోసం కాదు.

**శ్లో॥ ప్రాణినాం పతనంయేన తేనై వోత్పతనం స్మృతం ।**
**అజ్ఞస్తు బధ్యతే యేన జ్ఞాతాతేనైవ ముచ్యతే ॥**

**తా :** ప్రాణులు వేటిచేత పతనంచెందుతారో, దానిచేతనే ఊర్ధ్వగమనం (ఉత్పతనం) చెప్పబడినది. అజ్ఞాని, విషయములచేత బంధితుడవుతాడు. జ్ఞాని దానిచేతనే ముక్తుడవుతాడు. " సర్వజ్ఞ భైరవ తంత్ర" మందు ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ నాన్యత్రగమనం స్థానం మోక్షో స్తి సురసుందరి ।**
**అజ్ఞానగ్రంథి భేదోయః సమోక్ష ఇతికథ్యతే ॥**

**తా :** మోక్షమంటే మరొకచోటికి వెళ్ళడంకాదు. అజ్ఞానమనే గ్రంధి (ముడి) విడిపోవడమే, ప్రభాకౌశతంత్రంలో

**శ్లో॥ యావత్ తత్ పరమంశాంతం నవిజానంతి సుందరి ।**
**తావత్ పూజాజపధ్యాన హోమలింగార్చనాదికం**
**విదితేతు పరేతత్వే సర్వకారే నిరామయే**
**క్వ పూజా క్వజపోహోమః క్వచలింగ పరిగ్రహః ॥**

**తా :** పార్వతీ! ఎంతవరకూ పరమశాంత తత్వం తెలియదో అంతవరకూ పూజలు, జపాలు, ధ్యానం, హోమం లింగార్చన, అన్నీ అవసరమే నిరామయమైన సర్వాకార పరతత్వం తెలిసినపుడు పూజేమిటి! జపమేమిటి? హోమమేమిటి?

**శ్లో॥ క్షీరక్షయాత్ యధావత్సః స్తనా న్మాతుర్నివర్తతే**
**రాగక్షయా త్తథాపుంసాం మనః శీఘ్రంనిపర్తతే॥**
**నిః శ్వాసకారిక**

**తా :** పాలు అయిపోగానే ఆవుదూడ, గోమాత స్తనంనుండి దూరంగా వెడుతుంది. అలాగే మానవులకు రాగక్షయం కాగానే మనస్సు విషయం విముఖమవుతుంది.

తంత్రములలో శైవం, వైష్ణవం, శాక్తేయం, గాణాపత్యం, సౌరం, మొ॥ భేదములున్నవి. షట్కర్మలైన వశ్యాకర్షణ మోహన ఉచ్చాటన విద్వేషమారణ కర్మలు బోధించునది మాత్రమే తంత్రశాస్త్రము కాదు. ఆత్మయొక్క స్వస్వరూప జ్ఞానమును తెలియజేయునది. కామక్రోధాధి అంతఃశత్రువులను నిర్జించి శాక్తేయములో – "కుండలినీ" శక్తి – పరమశివరూప సహస్రార చక్రమందు సంయోగము చేయించునది. తంత్రశాస్త్రము. షట్కర్మలు తంత్రములోని ఒకభాగము మాత్రమే. తంత్రశాస్త్రము మొక్క పరిధిచాలా విస్తృతమైనది. జ్ఞానమార్గమునకు చెందినది. పరమేశ్వరుని తనివితీర అర్చించుటకు ఈ శరీరము ఆరోగ్యంగా ఉండవలసిందే. అందుకే.

**"భవత్పూజోప భోగాయ శరీరమిదమిస్తుమే॥** నీపూజ చేయుట కొరకు నాకు ఈశరీరము చిరకాలము ఉండుగాక' అనిస్తోత్రము చేశారు.

రసవాద విద్యయందు, లోహ వేధ, దేహవేధ, 2 చెప్పబడ్డాయి. పాదరసము శివవీర్య సంభూతము. దీనిచే నీచలోహములైన ఇనుము – రాగి – వెండి, వీటిని ఉత్కృష్ట లోహమైన, స్వర్ణముగా మార్పబడును.



దీనినే లోహవేధ అందురు. లోహవేధ సిద్ధించిన తరువాత–శుద్ధ–సిద్ధ పాదరసము యథోక్తపరిమాణములో, శరీరశుద్ధి అయినవారు సేవించినచో, కాయసిద్ధికలిగి అనేకవందల, వేల సం॥లు జీవింతురు. దీనినే దేహవేధ అందురు.

ఈ రసవాదవిద్యకూడా 'తంత్రశాస్త్రము'లోని ఒక భాగమే. ఇందు అనేక మూలికలు – యంత్రములు, మంత్రములు, ఉపయోగించబడతాయి. ఆధునిక శాస్త్ర విజ్ఞానరీత్యా కూడా పాదరసమునకు – బంగారమునకు ఒక్క అణునిర్మాణము మాత్రమే తేడాయున్నది. మెండెలేఫ్ శాస్త్రజ్ఞుడు రూపొందించిన మూలకముల పట్టికలో 80వ మూలకము Hg పాదరసము. 79వ మూలకము Au బంగారము. మూలకలచేత – లోహములచేత – అగ్నిచేత అనేక వివిధ ప్రక్రియలద్వారా పాదరసములోని అణునిర్మాణంలో) అణునిర్మాణమును తొలగించినచో, అది బంగారమగును. ఈవిద్య ఆధ్యాత్మిక ఉన్నతికి. లోకోపకారమునకు యోగులు ఉపయోగించే వారు. దేశము దరిద్రావస్థలో ఉన్నప్పుడు, బంగారము తయారు చేయవలసినదిగా రాజులు వినియోగించేవారని, ప్రాచీన రాజనీతి శాస్త్రములందు చెప్పబడినది.

పాదరసముయొక్క అనన్యమైన మహోపయోగము వైద్యశాస్త్రము నందు ఎంతో ప్రశంసించబడినది. శారీరక బలమునకు, వాజీ కరణమునకు, (గుర్రముయొక్క శక్తివంటి బలమునిచ్చు ఔషథం). అనేకరోగముల నాశనమునకు, శుద్ధ పాదరససేవనం చెప్పబడినది – **రసరత్నాకరములో**– రసమహిమ.

**శ్లో॥ హతోహంతి జరావ్యాధిం మూర్ఛితోవ్యాధి ఘాతకః**
**బద్ధఃఖేచరతాంధత్తే కోన్యః సూతాత్కృపాకరః ॥**

**తా :** పాదరసముయొక్క చాంచల్యాది దోషములను పోగొట్టి – మూర్ఛితముచేసి, ఇతరదోషములను పోగొట్టినచో, అట్టిరసము వ్యాధులను

నశింపచేయును. రసమును మారణముచేసి, ఇతరశుద్ధులను చేసి సేవించినచో ముసలితనమును పోగొట్టును. బంధించిన రసము ఖేచరత్వమిచ్చును. ఇటువంటి విశేష గుణములున్న 'పాదరసము' కంటే దయామయులెవరున్నారు.

# షడ్విధ ఫలములు

**శ్లో॥ త్వంమాతా సర్వభూతానాం పితాచాహం**
**సనాతనః ద్వయోశ్చయోరసోదేవి మహామైథున**
**సంభవః దర్శనాత్ స్పర్శనాత్తస్య భక్షణాత్**
**స్మరణాత్ ప్రియే । పూజనాద్రసదానాశ్చ దృశ్యతే**
**షడ్విథం ఫలమ్ । -** రసచింతామణి ॥

**తా :** ఈశ్వరుడు పార్వతితో చెప్పుదున్నాడు. ప్రియే! సర్వభూతములకు నీవుతల్లివి నేనుతండ్రిని ఇరువురియొక్క మైధునమునందు నాయొక్క వీర్యముగా 'పాదరసము' ఉద్భవించినది. దీనివలన 6విధములుగా శుభఫలితములు కలుగును. 1. దర్శనము, 2. స్పర్శనం 3. భక్షణం, 4. స్మరణం, 5. పూజనం, 6. రసదానం ఇవన్నియూ శుభప్రదములే.

# రసదర్శన ఫలం

**శ్లో॥ కేదారాదీని లింగాని పృధివ్యాం యానికానిచిత్ ।**
**తానిదృష్ట్వాచ యత్పుణ్యం తత్పుణ్యం రసదర్శనాత్ ॥**

**తా :** భూమియందు కేదారము మొ॥ శివలింగము లెన్ని యున్నవో, వాటి దర్శనఫలము. పాదరస దర్శన మాత్రముచే లభించును.



# రసస్పర్శ ఫలం

**శ్లో॥ చందనాగరు కర్పూర కుంకుమాంతర్గతో రసః ।**
**మూర్ఛితః శివపూజాసా శివసాన్నిధ్య సిద్ధయే !**
నిఘంటు రత్నాకరం ॥

**తా :** చందనం, అగరు (అగరువత్తులు కాదు. ఇది ఒకవిథమైన కర్ర). కర్పూరం, కుంకుమ, వీటితో శివలింగము చేసి, వీటిమధ్యలో మూర్ఛిత పాదరసంఉంచి 'అర్చన' చేసినచో శివానుగ్రహం కలుగుతుంది.

# రసభక్షణ ఫలం

**శ్లో॥ భక్షణాత్పరమేశాని హంతిపాపత్రయం రసః**
**దుర్లభం బ్రహ్మవిష్ణ్వాద్యైః ప్రాప్యతే పరమంపదం ॥**

**తా :** సర్వదోషరహిత శుద్ధ పారదసేవనంవల్ల శారీరక, మానసిక, వాచిక పాపములు నశించును. పరమపదము నిచ్చును. వైద్యమునందు ఔషధములలో రసము ఉపయోగిస్తారు. రసఔషధము సేవించునపుడు – పత్యము కఠినముగా పాటించవలయును. వీరికి "కకారాష్టకము' పనికిరాదు.

**శ్లో॥ కూష్మాండం కర్కటంచైవ కలింగం కారవేల్లకం**
**కుసుంభికాం చకర్కోటి కలంబీం కాకమాచికాం**
**కకారాష్టకమేతద్ధి వర్జయేద్ర సభక్షకః ॥**

**తా :** (రసమంజరి–రసరాజహంస–తోడరానంద–) రసము సేవించువారు–గుమ్మడి–కరక్కాయ, పుచ్చకాయ, కాకరకాయ, కొత్తిమీర, కాకమాచి, దోస. బచ్చలి ఈ ఎనిమిది తినరాదు. ఇంకా అనేక నియమములు ఆయుర్వేద గ్రంథములలో చెప్పబడినవి. వీటిని ఆచరించినచో– దివ్యామృతంవలె పనిచేయును. లేనిచో దుష్ఫలితములు కలుగును. కేవలం

'శుద్ధరసం' సేవించదలచినవారు, ముందుగా శరీరమును "క్షేత్రీకరణ" పద్ధతిద్వారా శుద్ధిచేసు కొనవలెను. క్షేత్రీకరణములోని "పంచకర్మలు" ప్రాచీన గ్రంధము లందున్నవి.

# రసస్మరణ ఫలం

శ్లో॥ హృద్యోగకర్ణి కాంతస్థం రసేంద్రం పరమేశ్వరి
స్మరన్ విముచ్యతే పాపైః సద్యోజన్మాంతరార్జితై । రసరాజ పద్ధతి ॥

**తా :** ఓ పార్వతీ! హృదయకమలమందు "రసేంద్ర" స్మరణ చేసినచో జన్మాంతర పాపములు నశించును.

# రసపూజన ఫలం

శ్లో॥ విధాయ రసలింగం యోభక్తియుక్తః సమర్చయేత్ ।
జగత్త్రితయ లింగానాం పూజాఫలమవాప్నుయాత్ ॥

**తా :** పాదరసముతో 'శివలింగము' చేసి, భక్తితో అర్చనచేసిన, మూడులోకములందున్న లింగార్చన ఫలితము పొందును.

శ్లో॥ స్వయంభూలింగసాహస్రై యత్ఫలంసమ్యగర్చనాత్
తత్ఫలం కోటిగుణితం 'రసలింగా' ర్చనాద్భవేత్ ॥

**తా :** వెయ్యి స్వయంభూలింగముల పూజాఫలితం ఎంత వచ్చునో, దానికి కోటిరెట్లు పూజాఫలితం 'రసలింగార్చన' వల్ల వచ్చును.

# రసదాన ఫలం

శ్లో॥ రోగిభ్యో యోరసందత్తే శుద్ధిపాక సమన్వితం
తులాదానాశ్వమేధానాం ఫలంప్రాప్నోతి శాశ్వతమ్ ॥

**తా :** శుద్ధిచేసి, వండిన 'రసౌషధములు' రోగులకు దానము చేసినచో, తులాదాన, అశ్వమేధయాగ ఫలితములు వచ్చును.



# రసధ్యానం

శ్లో॥ సిద్ధేరసే కరిష్యామి నిర్దారిద్ర్య గదం జగత్ ।
రసధ్యాన మిదంప్రోక్తం బ్రహ్మహత్యాది పాపనుత్ ॥

**తా :** నాకు 'రసవిద్య' సిద్ధించినచో ఈ ప్రపంచమంతయు, దారిద్రబాధ, రోగబాధ లేకుండా చేయుదును. ఇదియే రసధ్యానము. ఇదిపఠించినచో ఘోరమైన బ్రహ్మహత్యాపాతకము కూడా నశించును.

# రస నైవేద్యం

శ్లో॥ అభ్రగ్రాసోహి సూతస్య నైవేద్యం పరికీర్తితం ।
రసస్యైత్యర్చనంకృత్వా ప్రాప్ను యాత్క్రతుజంఫలం ॥

**తా :** పాదరసమునకు 'అభ్రకము'ను, ఆహారముగా సమర్పించవలెను. దీనినే 'రసనైవేద్య' మందురు. ఇట్లు పూజించినచో 'యాగఫలితము' వచ్చును.

★ ఈ విధముగా ఎన్నో విషయములు "రసవాదం గూర్చి మన ప్రాచీనగ్రంధములందున్నవి. ఎందరో ఔత్సాహికులు - మూలికా వేత్తలు-సమర్ధులు ఉన్నారు. మన ప్రాచీన రసవిద్య పరిశోధన, రసౌషధ పరిశీలన, ఉన్నతస్థాయిలో జరిగినపుడు, మానవాళికంతటికీ మహోపకారము జరుగును. అందరూ పరిపూర్ణ ఆరోగ్య వంతులగుదురు. ఇందుకు ప్రభుత్వము శ్రద్ధవహించాలి. మనదేశము నందు 'పాదరసము'పై పరిపూర్ణస్థాయిలో, సరైన పరిశోధన' జరగలేదు.

మానవజాతిని నశింపచేయు బాంబులకోసం- అణుపరీక్షల నిమిత్తం కోట్లాది రూపాయలు ప్రభుత్వం ఖర్చు చేయుచున్నది. మన ప్రాచీనవిద్యలయందు విశ్వాసములేక-నిరాదరణకు గురిచేసి-అజ్ఞానాంధకారములో నుంచుతున్నది ఈపద్ధతి మారాలి.

వైద్యసంస్థలు-ధనికులు-పరిశోధనా జిజ్ఞాసువులు, వీరైనా పాదరస పరిశోధనకు నడుంబిగించాలి. ఇది కలియుగం, క్షీణత్వం దీనిధర్మం కాలప్రభావం ఎలా ఉన్నా మానవునిలోని తపనఅనేది ఆరదుకదా!

ప్రాచీనులైన రససిద్ధయోగులు-మానవజాతి శ్రేయస్సుకై సంస్కృత భాషలో పాదరసముగూర్చి-లోహవేధ-దేహవేధగూర్చి కొన్ని అమూల్య గ్రంధములు రచించారు. వాటిలోకొన్ని మనకు లభించుటలేదు. విదేశీయులు కొన్ని అపహరించారు. తురుష్కుల దండయాత్రలో కొన్ని నశించిపోయాయి. ప్రస్తుతం లభించు కొన్ని గ్రంధములను ఇచ్చట వ్రాస్తున్నాను. వీటిలో ముఖ్యముగా ఔషధశాస్త్రమునుద్దేశించి రసౌషధ నిర్మాణ విధులు-ఆయుర్వేదము లోని రసభస్మ-కజ్జలీ-మొ॥ వివరములతో నున్నవి. పాదరస బంధకమగు మూలికలు-వెండి, బంగారము చేయు విధానములు-రంజనక్రియలు మొదలగునవి ఎన్నో విషయము లున్నవి.

# రసగ్రంధాలు

1. రసార్ణవం
2. రసరత్నాకరం
3. రసచంద్ర చింతామణ
4. రసహృదయం
5. రసరత్న సముచ్ఛయం
6. రసమంజరి
7. రససారం
8. రసచింతామణి
9. రసప్రకాశ
10. రసరాజహంస
11. రసరాజ పద్ధతి
12. రసావతారం
13. రసపద్ధతి
14. రసరత్న దీపిక
15. రసమంగళ
16. రససంకేత కలిక
17. రసకామధేను
18. రసపారిజాతం
19. రసరాజ శంకరం
20. రససింధు
21. రసప్రకాశ సుధాకర
22. ధరణిధర సంహిత



23. యోగసార
24. తోడరానందం
25. క్షీరసింధు
26. అభిదాన కామధేను
27. అజీర్ణ మంజరి
28. నిఘంటు రత్నాకరం
29. లోహపద్ధతి
30. గంధక కల్పం
31. యోగతరంగిణీ
32. దేవీయామళం
33. కాకచండీశ్వరం
34. పురందర రహస్యం
35. భావప్రకాశ
36. రసమార్తాండ
37. నాగార్జునం
38. రసేంద్ర కల్పద్రుమం
39. ధాతురత్నమాల
40. శారఙ్గధర

# రసయోగులు

నాగార్జునుడు-చర్పటినాధుడు, నిత్యానాధుడు, భైరవానందుడు, వేమన, రేవణసిద్ధుడు మొ॥ ఆధునికులలో భారతీయులతోబాటు, కొందరు విదేశీయులుకూడా ఉన్నారు "నాయన"గా పేరుపొందిన గణపతిముని సిద్ధయోగులు, సిద్ధక్షేత్రములలో సంచరించుయోగులు పుణ్యాత్ములకే సందర్శనభాగ్యం కలుగుతుంది.

తంత్రశాస్త్రము ప్రధానముగా 3 రకములు.

1. ఆగమం, 2. తంత్రం 3. యామళం "వారాహీతంత్రం'లో వీటిలక్షణములు ఈ క్రిందివిధముగా చెప్పబడినవి.

**శ్లో॥ సృష్టిశ్చ ప్రలయశ్చైవ దేవతానాం తధార్చనం**
**సాధనంచైవ సర్వేషాం పురశ్చరణమేవచ ।**
**షట్‌కర్మ సాధనంచై వ ధ్యానయోగః చతుర్విధః**
**సప్తభిర్ల క్షణైర్యుక్తం ఆగమం తద్విదుర్బుధాః ॥**

**తా :** ఆగమ శాస్త్రమునకు 7 లక్షణములు కలవు ఇవి 1. సృష్టి, 2. ప్రళయం, 3. దేవతల పూజావర్ణన, 4. సాధనావిధానం 5. పురశ్చరణ, 6. షట్‌కర్మ సాధన (వశ్యఆకర్షణ మోహన-విద్వేషణ- ఉచ్చాటన, మారణములను ఆరుకర్మలు) 7. చతుర్విధ ధ్యానయోగము, (మంత్రయోగం రాజయోగం, హఠయోగము, లయయోగము, అనిధ్యానయోగము 4 రకములు) వీటిని వివరించు గ్రంధములు ఆగమశాస్త్రములు. ఇక **"తంత్రశాస్త్ర"** లక్షణములు.

**శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ మంత్రనిర్ణయ ఏవచ**
**దేవతానాంచ సంస్థానం తీర్థానాంచైవ వర్ణనం**
**తథై వాశ్రమ ధర్మశ్చ విప్రసంస్థానమేపచ**
**సంస్థానంచైవ భూతానాం యంత్రాణాంచైవనిర్ణయః**
**ఉత్పత్తిర్వి బుధానాంచ తరూణాం కల్పసంజ్ఞితం**
**సంస్థానం జ్యోతిషాంచైవ పురాణాఖ్యానమేవచ ॥**
**కోశస్య కథనంచై వ వ్రతానాం పరిభాషణం**
**శౌచాశౌచస్య చాఖ్యానం స్త్రీపుంశోశ్చైవ లక్షణం**
**హరచక్రస్య చాఖ్యానం నరకాణాంచ వర్ణనం**
**రాజధర్మో దానధర్మో యుగధర్మస్తథైవచ**
**వ్యవహారః కథ్యతేచ తథాచాధ్యాత్మ వర్ణనం**
**ఇత్యాది లక్షణైర్యుక్తం తంత్రమిత్యభీధీయతే ॥**

**తా :** సృష్టి-లయం-మంత్రనిర్ణయం. దేవతా ప్రతిష్ఠ-తీర్ధవర్ణన -ఆశ్రమవర్ణన-యంత్రనిర్ణయం-వృక్షమూలికా విజ్ఞానం- రసవాదం- జ్యోతిషం-పురాణ కథనం నిఘంటుజ్ఞానం- వ్రతములు-శౌచాశౌచ నిర్ణయం సాముద్రికం-రాజధర్మం- యుగధర్మం-వ్యవహార-ఆధ్యాత్మిక విషయములను బోధించునది 'తంత్రం'.

ఇక "యామళ" లక్షణములను ఈ విధంగా ఉల్లేఖించారు.



**శ్లో॥ సృషిశ్చ జ్యోతిషాఖ్యానం నిత్యకృత్యప్రదీపనం**
**క్రమసూత్రం వర్ణ భేదో జాతిభేద స్తథైవ చ**
**యుగధర్మశ్చ సంఖ్యాతో యామలస్యాష్టలక్షణమ్ ॥**

**తా :** సృష్టితత్వం, జ్యోతిషం, నిత్యకర్మ, కధనం క్రమసూత్రం, వర్ణభేదం, జాతిభేదం, యుగధర్మమొ ఎనిమిది లక్షణములతో కూడినది యామళ గ్రంధములనబడును.

ఉదా :- రుద్రయామళం, కృష్ణయామళం శివుడు తంత్ర శాస్త్రమును శ్రీకృష్ణునికి బోధించినట్లు 'మేరుతంత్రం'లో చెప్పబడింది.

★ మహావిశ్వసార తంత్రమందు ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ చతుష్షష్టిశ్చ తంత్రాణియామళాదీని పార్వతి**
**సఫలానీహ వారాహే విష్ణుక్రాంతసు భూమిషు ।**
**కల్పభేదేన తంత్రాణి కథితానిచ యానిచ**
**పాఖండ మోహనాయైవ విఫలానీహ సుందరి ॥**

**తా :** హే పార్వతి, విష్ణుక్రాంత భూములయందు 64 తంత్రములు సఫలమగునట్లు నాచే చెప్పబడినది. నాస్తికులను మరింత మోహింప జేయుటకు, కల్పభేదముచేత విఫలతంత్రములు కూడా నాచే బోధింపబడినవి.

# ప్రతిష్ఠా తంత్రములు

**శ్లో॥ ప్రతిష్ఠాకల్ప కౌమారం, కిరణం, పింగలామతం । దేవ్యామత, మయం, నంది, ప్రతిష్ఠాపరమేశ్వరం. ॥ భాస్కరంలింగరూపంచ, విద్యాపురాణ వార్తలం ॥ శక్రాఖ్యం, వామదేవం, చ ద్విధా పైతామహంతధా, బాణ, గర్గమతం, యామ్యం, హంసాఖ్యం, వైశ్యకర్మకం॥ ప్రతిష్ఠా తంత్రణ్యేతాని శివోక్తాన్యేక వింశతిః ॥**

భూమండలంపై 'తంత్రశాస్త్రం' 3 ప్రముఖ రీతుల్లో విస్తరించి యున్నట్లు ప్రాచీనగ్రంధాలలో పేర్కొనబడింది. ఇవి 1. రథక్రాంత 2. విష్ణుక్రాంత, 3. అశ్వక్రాంత, అని ఒక్కొక్క పద్ధతిలో 64 తంత్రగ్రంధాలు ఉన్నాయి. ఈ విషయమే "అశ్వక్రాంతా రథక్రాంతా విష్ణుక్రాంతా వసుంధరా" అని ఉల్లేఖించబడింది.

## రధక్రాంత తంత్ర గ్రంధాలు

1. చిన్మయ తంత్రం
2. మత్స్యసూక్తం
3. మహిషిమర్ధినీ తంత్రం
4. మాతృకోదయ తంత్రం
5. హంసమహేశ్వర తంత్రం
6. మేరుతంత్రం
7. మహనీల తంత్రం
8. మహానిర్వాణ తంత్రం
9. భూత డామరతంత్రం
10. దేవ డామర తంత్రం
11. విజయచింతామణి తంత్రం
12. ఏకజటా తంత్రం
13. వాసుదేవ రహస్యం
14. బృహద్‌గౌతమీయ తంత్రం
15. వర్ణోద్ధృతి
16. ఛాయానిల తంత్రం
17. బృహద్యోని తంత్రం
18. బ్రహ్మజ్ఞాన తంత్రం
19. గరుడ తంత్రం
20. వర్ణ విలాస తంత్రం
21. బాలవిలాస తంత్రం
22. పురశ్చరణ చంద్రికా
23. పురశ్చరణ రసోల్లాస
24. పంచదశీ తంత్రం
25. పిచ్ఛలా తంత్రం
26. పరమేశ్వర తంత్రం
27. నవరత్నేశ్వర తంత్రం
28. నారదీయ తంత్రం
29. ప్రపంచ సారం
30. నాగార్జున తంత్రం
31. యోగసారము
32. దక్షిణామూర్తి తంత్రం
33. యోగస్వర్ణోదయ
34. యక్షిణీ తంత్రం



35. సర్ణోదయం
36. జ్ఞానభైరవ తంత్రం
37. ఆకాశభైరవ తంత్రం
38. రాజరాజేశ్వరీ తంత్రం
39. రేవతీ తంత్రం
40. సారస తంత్రం
41. ఇంద్రజాల తంత్రం
42. కృకలాసదీపిక తంత్రం
43. కంకాళమాలిని తంత్రం
44. కాలోత్తమ తంత్రం
45. యక్షధర్మ తంత్రం
46. సరస్వతీ తంత్రం
47. శారదా తంత్రం
48. శక్తి సంగమ తంత్రం
49. శక్తికాగమ తంత్రం
50. సమ్మోహినీ తంత్రం
51. ఆచార సారం
52. చీనాసారం
53. షడామ్నాయతంత్రం
54. కరాళభైరవ తంత్రం
55. శోధ తంత్రం
56. మహాలక్ష్మీ తంత్రం
57. కైవల్య తంత్రం
58. కులసద్భావ తంత్రం
59. సిద్ధిపద్ధతి
60. కీర్తిసార తంత్రం
61. కాలభైరవ తంత్రం
62. ఉడ్డామరేశ్వర తంత్రం
63. మహాకాల తంత్రం
64. భూతభైరవ తంత్రం

## విష్ణుక్రాంత తంత్ర గ్రంధములు

1. సిద్ధీశ్వర తంత్రం
2. కాళీ తంత్రం
3. కులార్ణవ తంత్రం
4. జ్ఞానార్ణవ తంత్రం
5. నీలతంత్రం
6. ఫేత్కారిణి తంత్రం
7. దేవ్యాగమం
8. ఉత్తరాతంత్రం
9. శ్రీక్రమం
10. సిద్ధియామళం
11. మత్స్యసూక్తం
12. సిద్ధసార తంత్రం
13. సిద్ధసారస్వతం
14. వారాహీ తంత్రం

15. యోగినీ తంత్రం
16. గణేశ విమర్శినీ
17. నిత్యాతంత్రం
18. శివాగమం
19. చాముండా తంత్రం
20. ముండమాలా తంత్రం
21. హంసమహేశ్వర తంత్రం
22. నిరుత్తర తంత్రం
23. కులప్రకాశ తంత్రం
24. దేవీకల్పం
25. గంధర్వ తంత్రం
26. క్రియాసారం
27. నిబంధ తంత్రం
28. స్వతంత్ర తంత్రం
29. సమ్మోహన తంత్రం
30. తంత్ర రాజం
31. లలితా తంత్రం
32. రాధా తంత్రం
33. మాలినీ తంత్రం
34. రుద్రయామళం
35. బృహత్ శ్రీక్రమం
36. గవాక్ష తంత్రం
37. సుకుముదినీ తంత్రం
38. విశుద్ధేశ్వర తంత్రం
39. మాలీనీవిజయతంత్రం
40. సమయాచారం
41. భైరవీ తంత్రం
42. యోగినీ హృదయం
43. భైరవ తంత్రం
44. సనత్ కుమార సంహిత
45. యోనితంత్రం
46. తంత్రాంతరం
47. నవరత్నేశ్వరం
48. కులచూడామణి
49. భావచూడామణి
50. దేవప్రకాశ
51. కామాఖ్య తంత్రం
52. కామధేను తంత్రం
53. కుమారీ తంత్రం
54. డామర తంత్రం
55. యామల తంత్రం
56. బ్రహ్మసారం
57. విశ్వసారం
58. మహాకాల తంత్రం
59. కులోడ్డీశ తంత్రం
60. కులామృతం
61. కుబ్జికా తంత్రం
62. యంత్ర చింతామణి
63. కాళీవిలాసం
64. మాయా తంత్రం



# అశ్వక్రాంత తంత్ర గ్రంథములు

1. భూతశుద్ధి తంత్రం
2. గుప్తదీక్షా తంత్రం
3. బృహత్ సారం
4. తంత్రసారం
5. వర్ణసారం
6. క్రియాసారం
7. గుప్త తంత్రం
8. గుప్తసారం
9. బృహత్తోడల తంత్రం
10. బృహన్ని ర్వాణ తంత్రం
11. బృహత్ కంకాళినితంత్రం
12. సిద్ధాతంత్రం
13. కాళతంత్రం
14. శివతంత్రం
15. సారతద్ సారం
16. గౌరీతంత్రం
17. యోగతంత్రం
18. ధర్మ తంత్రం
19. తత్త్వచింతామణి
20. బిందు తంత్రం
21. మహాయోగినీ తంత్రం
22. బృహద్యోగిని
23. శివార్చన తంత్రం
24. శంబర తంత్రం
25. శూలినీ తంత్రం
26. మహామాలినీ తంత్రం
27. మోక్షతంత్రం
28. బృహన్మాలినీ తంత్రం
29. మహామోక్ష తంత్రం
30. బృహన్మోక్ష తంత్రం
31. గోపీ తంత్రం
32. భూతలిపి తంత్రం
33. కామినీ తంత్రం
34. మోహినీ తంత్రం
35. మోహన తంత్రం
36. సమీరణ తంత్రం
37. కామకేశ్వర తంత్రం
38. మహావీర తంత్రం
39. చూడామణి తంత్రం
40. సర్వార్చన తంత్రం
41. గోప్య తంత్రం
42. తీక్ష్ణ తంత్రం
43. కామరత్న తంత్రం
44. గోపలీలామృతం
45. మంగళా తంత్రం
46. బ్రహ్మానంద తంత్రం
47. చీనతంత్రం
48. మహానీరుత్తర తంత్రం
49. భూతేశ్వర తంత్రం
50. గాయత్రీ తంత్రం

| | |
|---|---|
| 51. విశుద్ధేశ్వర తంత్రం | 58. లీలావతీ తంత్రం |
| 52. యోగార్ణవ తంత్రం | 59. బృహచ్చీన తంత్రం |
| 53. ఘేరండ తంత్రం | 60. కురంజ తంత్రం |
| 54. మంత్ర చింతామణి | 61. జయారాధా మాధవం |
| 55. యంత్ర చింతామణి | 62. ఉజ్జాసక తంత్రం |
| 56. విద్యుల్లతా తంత్రం | 63. ధూమవతీ తంత్రం |
| 57. భువనేశ్వరీ తంత్రం | 64. శివాతంత్రం |

ఈ గ్రంధములకు వ్యాఖ్యానములు. ప్రయోగ ఫలితములు విమర్శలతో, ప్రాచీనులు–మధ్యకాలీనులు తంత్రాలోకం– నిత్యాషోడశి కార్ణవం– శాక్తప్రమోదం–వామకేశ్వర తంత్ర మొ॥ గ్రంధములను, విపులీకరణము గానూ, సంగ్రహముగానూ, రచించారు.

ఇవేగాక, బుద్ధుని నిర్యాణానంతరం, బౌద్ధతంత్ర శాస్త్ర గ్రంధములు కూడా రచింపబడ్డాయి. ఈ శాస్త్రమును బుద్ధుడే స్వయముగా గుహ్యపతి వజ్రపాణిగా అవతరించి, ఉపదేశించినట్లు శాస్త్రములలో చెప్పబడింది. బౌద్ధ తాంత్రికులలో శాంతిరక్షితుడు– పద్మసంభవుడు. తాంత్రిక శిరోమణులుగా కీర్తిగడించారు. వీరు టిబెట్ దేశము వెళ్ళి "బసమ్–యస్–అచింతా" అనే విహారముస్థాపించిన విద్యాబోధన చేశారు తంత్రశాస్త్ర గ్రంధములను టిబెట్ భాషలోనికి అనువాదము చేశారు. టిబెట్ భాషలో తంత్రశాస్త్రమును "ఋగ్‌యుద్" అంటారు. ఇది 81 భాగములుగా నున్నది బౌద్ధగురువులయిన 'లామా'లకు ఈవిద్యనేర్పుతారు బౌద్ధ తాంత్రికపద్ధతి 'వజ్రయానం' పేరుతో ప్రఖ్యాతి పొందింది.

జైనధర్మములో మొదటి తీర్థంకరుడైన 'ఋషభదేవుడు' జైనతంత్ర గ్రంధములకు ప్రవర్తకుడుగా తెలుస్తోంది. ఋషభదేవుని, కుమారుడైన 'నేమినాథు'నికి, నాగరాజు ఆకాశగమనవిద్య బోధించాడు. దిగంబర జైన గ్రంధములలో 500 మహావిద్యలు పేర్కొనబడ్డాయి. 23 వ తీర్థంకరుడైన పార్శ్వనాధుడు–జైనతంత్ర సంప్రదాయమునకుఎంతో పరిపుష్టి కలిగించాడు.



అనంతర గురువులలో 'సింహతిలకసూరి' మంత్రరాజ రహస్యం – తంత్ర లీలావతి అనే గ్రంధాలు రచించాడు. శ్రీ జినప్రభాసూరి–పద్మావతీ వరప్రభావంవల్ల, మంత్ర–తంత్ర జ్ఞానముపొంది–సంగ్రహముగా 'రహస్య కల్పద్రుమం' అనే గ్రంధం రచించాడు ఈ గ్రంధములోని కొంతభాగము – రాజస్థాన్‌లోని, బికనీర్ నందుగల "నాహటాజీ" లైబ్రరీలో కలదు. శ్రీహలాచార్యుడు –'జ్వాలినీ మతం' అనే తంత్రశాస్త్ర గ్రంధం రచించాడు. ఇందులో 1. మంత్ర, 2. గ్రహ, 3. ముద్ర, 4. మండల, 5. కటుతైల, 6. వశ్యయంత్ర, 7, సుగంధ. 8. స్నపనవిధి 9. నీరాజనవిధి, 10. సాధనావిధి అనే పది భాగములున్నవి.

జైనతంత్ర సాహిత్యమునకు శ్రీ సిద్ధసేనుడు – అకలంక దేవుడు – జినదత్తసూరి మునిగుణాకర, కుందకుందాచార్య హేమచంద్రా చార్య, ఇంద్రనంది, మొ॥ ఎందరో శాస్త్రవేత్తలు గొప్పగ్రంధములు రచించారు.

భైరవ పద్మావతీకల్పం–సూరిమంత్రకల్పం–అర్జున పతాక– నమస్కార యంత్ర–యంత్రచింతామణి మొ॥ జైనతంత్ర గ్రంధములు, మల్లిషేణుడు 11వ శతాబ్దిలో, 'విద్యానుశాసనం' అనే తంత్రగ్రంధం రచించాడు. ఇందు 5 వేల శ్లోకములున్నవి. ఇది మహత్తర తంత్ర గ్రంధం.

ముద్రణకాని అమూల్య తంత్ర పుస్తకాలు నేపాల్ లోని దర్బార్ గ్రంధాలయం, కాశీలోనూ, తంజావూరులోని సరస్వతీమహల్ పుస్తకాలయం, కలకత్తాలోని ఏషియాటిక్ సొసైటీ, త్రివేండ్రంలోని సంస్కృత ప్రాచ్యలిఖిత పుస్తకాలయం, జోథ్‌పూర్, మద్రాస్ గ్రంధాలయాలలోనూ విదేశాలలో జర్మనీలోనూ, లండన్‌లో ఇండియా ఆఫీస్ గ్రంధాలయంలోనూ, ఎన్నో ఉన్నాయి. త్వరలోనే ఇవన్నీ ముద్రణ కావాలని తంత్రసాహిత్యగరిమ మరింతగా ప్రభావితం అవ్వాలని పరమశివుని ప్రార్ధిస్తున్నాను.

కార్తీక శివరాత్రి
1998

తంత్ర జిజ్ఞాసువు
**మేడవరపు సంపత్ కుమార్**

శ్రీం

శ్రీ మహాగణాధి పతయే నమః

# అశ్వలాయనాయ నమః

ఓం సద్యోజాతాయ నమః

అథ మేరుతంత్రం ప్రారంభ్యతే

**శ్లో॥ యధాసత్ సదివాభాతి న చ భాతి కదాపిసత్ ।**
**యస్మిన్ జ్ఞాతే నసాభాతి తస్మైతస్మై నమోనమః ॥**

★ జలంధరాసురునిచేత ఓడిపోయిన దేవతలు, బాధలు పొందు సమస్త ప్రాణులు, సూక్ష్మరూపధారులై పరమేశ్వరుని ప్రార్థించారు. సమాధి నిష్ఠుడైయున్న శివుని వామాచారులు, దక్షిణాచారులు అర్చించారు. అంబ, సకల దేవతా బృంద శ్రేయస్సుకై అజ్ఞాన నివృత్తికై ధ్యానం నుండి మరలిన శివుని ఈ విధంగా ప్రార్థించింది.

స్వామీ! నన్ను పరాశక్తి అంటారు. మిమ్ములను పరమేశ్వరు లంటారు. మరి మీరు ధ్యానంలో, ఎవరిని గూర్చి ధ్యానిస్తారు. నాకు తత్వబోధ చేయమని కోరింది. మహేశ్వరుడు స్మితవదనుడై ఇంద్రాది దేవతలను, పార్వతిని ఉద్దేశించి ఈవిధంగా చెప్పాడు. మానవులకు 100 సం॥లు ఆయువు, దేవతలకు ఇది 100 రోజులు, అంటే మానవులకు ఒక సం॥ము, దేవతలకు 1 రోజు అగును. ఈ విధంగా దేవతలకు 100 సం॥లు ఆయుర్దాయము కలదు. ఈ కాలము నాచే నిత్యమూ ధ్యానింపబడు 'మహామాయా' యొక్క శ్వాస నిర్గమము.

దేవతలకు 100 సం॥లు, బ్రహ్మకు ఒక దినము మహామాయ యొక్క కుంభకశ్వాస. రాత్రికాలము, ఆమెయొక్క ఘటికాకాలము బ్రహ్మకు 1 సం॥ము. ఈ విధముగా బ్రహ్మకీటకమువలె 100 ఘటికలు జీవించును. 15 రోజులు సతీరూపంగా పార్వతి జీవించును. విష్ణువు 2 నెలలు జీవించును. నేను 100 సం॥లు జీవింతును. ఈ విధముగా మహాకాల



మహిషి అయిన మహామాయ 100 సం॥లు పూర్తి అయిన తరువాత పాము కుబుసము విడిచినట్లు దేహమును విడిచి పునః నూతనత్వమును పొంది మరల సృష్టి సంభవించును. అని శివుడు చెప్పగా, అహంకారము తొలగిన దేవతలు మహాకాలుని గూర్చి, ముక్తి ఉపాయము గూర్చి ప్రార్థించగా ఈశ్వరుడిట్లు పలికెను. అనేకమంది జిజ్ఞాసకలవారైనపుడు పార్వతి నన్ను ప్రశ్నించగా 108 తంత్రములు బోధించితిని వేదసారము, ధర్మసారము, కలిగినది, ఈ తంత్రశాస్త్రము అన్ని తంత్రములోనికి మేరు శిఖరమువంటిది కనుక ఈ తంత్రమునకు "మేరుతంత్ర" మని పేరు. కలికాలమందు మానవులు శిశ్నోదర పరాయణులై, షట్కర్మనిరతులై (ప్రయోగములు) 'బలహీనులై ఉంటారు. వారి ఉద్ధరణకై సులభోపాయంగా ఉపదేశింపబడుచున్నది. సరస్సు సన్మార్గ వర్తినియై మహానదిని చేరునట్లు మానవుడు సన్మార్గానుగామియైు దేవత్వమును పొందును. శ్రీదేవి ఉవాచ-వామ-దక్షిణ ఆచార భేదములు ఎట్లు ఏర్పడినవి? వీటిలో ప్రశస్తమైనది ఏది? ఏవరు దేనిని ఆశ్రయించాలి **శివ ఉవాచ** పురాకల్పరూపంలో దేవాసురులు క్షీరసాగరమధనం చేసినపుడు సురాకలశము ధరించి 'శ్యామ' ఉద్భవించినది. అపుడు దానవులు శుక్రాచార్యుని వరమువల్ల, దేవతలను జయించి ఆకలశము గ్రహించి దానిని పానము చేసిరి. దేవతలు పారిపోగా, అక్కడవున్న కొందరు దేవతలు పుణ్యమైన సురాపానముచేసి కొన్ని వరముల నిచ్చిరి.

సురాశేషము మానవులు గ్రహించి, శక్తులనారాధించి భుక్తి-ముక్తులు పొందెదరని వారు వరమిచ్చిరి. తిరిగి సాగర మధనము చేయగా అమృతకలశముతో ధన్వంతరి ఉద్భవించాడు. సురామత్తులైన రాక్షసులు ఇదేమికలశమని అడుగగా, విష్ణువు సురతాగిన పూర్వదేవతలను, దానవులను తన మధురమైన మోసగింపు మాటలతో, దీనిని నిస్సారమైనదిగా చెప్పి, మోహినీ రూపధారియై వామహస్తములతో పూర్వదేవతలకు, దక్షిణ హస్తముతో

దేవతలకు పంచిపెట్టెను. ఇది గ్రహించి భైరవాదిమంత్ర అధిష్ఠాన దేవతలు పూర్వదేవతలను బాధించగా వారు దేవతలతో కలహించిరి. ఇది శుక్రాచార్యుడు గ్రహించి సురాపానమువల్ల దానవులు మత్తులై విష్ణుమాయకు లోబడినారని, సురను పాతకిగా శపించెను. సురాధిష్ఠాన దేవత కోపించి మూడు లోకములను క్రోధజ్వాలచే తపింపచేయగా దేవదానవులంతా భయపడిరి ఆమెను బీజగర్భ మంత్రములచే నేను స్తుతి చేయగా శుక్రుడు ఆమె పాదములపై బడి ప్రార్థించెను.

మాయ, రమా, వాణిశక్తుల నుండి 3 సం॥ల బాల ఉద్భవించి శుక్రశాప విమోచనము చేయమని కోరగా షోడశాక్షరి 108 సార్లు మంత్రించి, శాపవిమోచనము గావించినది. ఇది 3 అక్షరముల బాలమంత్రము నుండి, 16 అక్షరముల షోడశదీక్ష వరకు గ్రహించి, సేవించినచో భుక్తి–ముక్తిప్రదమగునని, ఇది కౌళమార్గమని, వామ మార్గమని పిలువబడును.

ఈ ఆచారమునందు "మ" కారపంచకం 1.మద్యం, 2. మాంసం 3. మత్స్యం 4. ముద్ర 5. మైథునం, సంతోషముతో సేవించవలెను. కౌళమతం అంగుష్ఠసమమని వామం తర్జని, సమమని, శాబరం కనిష్ఠికాసమమని, వామమార్గం 5 రకములు.

వీటిలో వైదికమార్గం కర్తవ్యమైనది. స్మార్తమార్గం మధ్యమోత్తమం పురాణక్రమం, మధ్యమం, తాంత్రికం అధమమైనది. కలియుగమందు గురువులు ధనార్థులు, శిష్యులు సిద్ధిని కోరువారు, కనుక ఉభయసిద్ధికి దేవతలు ఆలస్యం చేయుదురు.

**శ్లో॥ "దీయతే జ్ఞాన విజ్ఞానం క్షియతే పాపరాశయః ।**
**తేన దీక్షా ఇతిప్రోక్తాప్రాప్తాచేత్ సుగురోర్ముఖాత్ ॥**

**తా :** జ్ఞానవిజ్ఞానమును ఇచ్చునది, పాపరాశినిక్షిణింపచేయునది దీక్ష అనబడును. దీనిని సద్ గురువు నుండి, నిమనిష్ఠలు గలవారినుండి గ్రహింపవలయును.



# సద్ గురువు లక్షణములు

శ్రేష్ఠుడు–అన్ని అవయవములు బాగుగాయున్నవాడు పరిశుభ్రమైన వేషము–అందమైనవాడు–అన్ని తత్వములు తెలిసిన వాడు–అన్ని మంత్రవిధానములు తెలిసినవాడు–ఇంగిత జ్ఞాని–దుర్జన సహవాసము లేనివాడు, అంతర్ముఖుడు దేశకాలజ్ఞుడు, ఆజ్ఞాసిద్ధుడు– దయగలవాడు–వేద వేదాంగములు నేర్చినవాడు– నిత్యనైమిత్తిక కర్మలు చేయువాడు లోభము లేనివాడు – అహింసాపరుడు–శాంత గుణము కలవాడు–నింద్యకర్మలు చేయనివాడు అయివుండవలెను.

ఇటువంటివారే మంత్రోపదేశమునకు, అర్హులు బ్రాహ్మణుల నుండే ఇతర వర్ణములవారు దీక్ష గ్రహించ వలయును. ప్రతిలోమదీక్ష గ్రహించరాదు, ఈ విధముగా కానిచో, అట్టిమంత్రము దుఃఖప్రదమగును. ఓంకారము లేనిమంత్రము వేదమంత్రము కాదు. స్త్రీ శూద్రులకు ఆగమం శ్రేష్ఠం. నమః అంతమందున్న ఏమంత్ర మైననూ, అందరికీ ఉపదేశమివ్వవచ్చును. హ్రీం బీజము బ్రాహ్మణము శ్రీం బీజము క్షత్రియం. క్లీంబీజము వైశ్యం, ఐం బీజం శూద్రం. ఈ నాలుగు బీజములు లేనిమంత్రము "పౌలస్త్యం అనబడును.

ఛిన్నమస్తా–మాతంగి–బగళా–ఉగ్రతారకా–యోగియక్షుణులు –త్రిపురా–బటుకభైరవం–శాబరం–పౌలస్త్యం మంత్రములు బ్రాహ్మణులు జపించరాదు.

ఉపాసన 3 విధములు. సాత్విక–రాజసీ తామసీ మానసికం సాత్వికం, విగ్రహారాధన రాజసం పీఠాదులయందు బలిదానములతో కూడినది తామసం. మానవులకు గర్భమందుండగా 3 సంస్కారములు. పుట్టిన తరువాత 10. మరణానంతరం 3 మొత్తం 16 షోడశ కర్మ సంస్కారములు సంభవించును. ఇదేవిధముగా మంత్రమునకు 16 సంస్కారములు జరుపవలెను. తంత్రములు 108 నాచే చెప్పబడిన అన్నిటికంటే వైదికమార్గం

గొప్పది. తరువాత స్థానంతంత్రశాస్త్రం. అనంతరస్థానములలో సంహిత–అర్ణవం– యామలం తాండపం–ఇంద్రజాలం–కక్షపుటి–బౌద్ధం– జైనం–శాబరం అగుచున్నవి. బ్రాహ్మణులకు వామమార్గము నరకప్రద మగును. చంద్రబలము బాగున్నపుడు మంత్రోపదేశము పొందవలెను తారా బలానుసారముగా మంత్రాధిష్ఠాన దేవత కృప కలుగును. చంద్రగ్రహణ సమయంలో ఉపదేశం పొందరాదు. పొందినచో దారిద్ర్యము కలుగును. సూర్యగ్రహణ సమయంలో సంపదలు కలుగును.

## మంత్రమునకు 16 సంస్కారములు

**1. జాగృతి–**ఇది గురువు చేయాలి. ఓం–రం బీజంలు ఇడాపింగళులు సమానంగానున్నపుడు, ప్రబోధకాలమందు జపించాలి. మనుపుకు సంపుటి చేయాలి.

**2. సంజననం–**చందనం–మారేడు–లేదా, మామిడి, పీఠంపై కుంకుమ–కస్తూరిచేత పంచభూత బీజములువ్రాసి చక్రమునందు మాతృకాదేవిని ఆహ్వానించి పూజించి 108 సార్లు జపించి, మనువును స్వర–వ్యంజన–బిందు విసర్గలను సంపుటిచేసి మంత్రమును పుట్టించవలయును.

**3. జీవనం ఆది–**మధ్య–అంతములందు ప్రణవం చేర్చి 108 సార్లు మనువుజపిస్తే మంత్రం జీవితమవుతుంది.

**4. తాడనం–**గోరోజనం–కుంకుమతో భూర్జపత్రంపై మనువు లిఖించి చందన జలముచేత ప్రతీఅక్షరం 100సార్లు కొట్టాలి. కొట్టేసమయంలో వాయుబీజం ఉచ్చరించాలి.

**5. బోధనం–**పూర్వోక్త పీఠమునందు మనువువ్రాసి మంత్రాక్షర సంఖ్యచేత కరీవేర పుష్పములు మంత్రించి ప్రత్యక్షరం 100 సార్లు అగ్నిబీజముతో కొట్టాలి.



**6. అభిషేకం–** పూర్వోక్తపీఠమందు అష్టదళపద్మం లిఖించి కర్ణికయందు జాజితీగచేత మంత్రాక్షరములు వ్రాసి రావి చిగుళ్ళచేత మంత్రాక్షర సంఖ్యతో మనువుఉచ్చరించి నమః అంతముగా జలాభిషేకం చేయాలి.

**7. ఆననం–** మూలాధారాగ్ని మండలమదు మనువును "ఓం–హౌం" అను రెండు బీజములచేత, దగ్ధమైన్లు భావించాలి.

**8. విమలీకరణం–** పూర్వోక్త పీఠమందు కుంకుమాది ద్రవ్యములతో మంత్రము లిఖించి, రాగిపాత్రలో కస్తూరి వేసి జలమునింపి, మనువును 108సార్లు ఆనీటిలో వ్రాయాలి.

**9. ఆప్యాయనం–** తరువాత ప్రతీఅక్షరమును 3 సార్లు కుశోదకముచేత ప్రోక్షణ చేయాలి.

**10. తర్పణం–** రాగిపాత్రలో కస్తూరిచేత మంత్రం లిఖించి మరొకపాత్రలో కర్పూర జలముతో, మనువు స్మరిస్తూ నమోంతముగా తర్పణం చేయాలి.

**11. దీపనం–** ఓం హ్రీంశ్రీం పూర్వకముగా మనువు 108 సార్లు జపించినచో, మంత్రమందు శక్తిదీప్తమగును. ఇది రహస్యముగా ఉంచి, మిగిలిన పురశ్చరణ పూర్తి చేసినచో మంత్రమునకు షోడశ సంస్కారములు అగును.

## అష్టగంధములు

**గణపతికి** 1. చందనం, 2. అగరు, 3. కర్పూరం, 4. గోరోచనం 5. కుంకుమపూవు, 6. గజమదం, 7. రక్తచందనం 8. జలం.

**విష్ణువునకు** 1.హ్రీబేరం, 2. చందనం 3. కుష్ఠం 4. అగరు, 5. కుంకుమపువ్వు 6. ముర. 7. బాహ్లికం. 8. జటామాంసి.

**శక్తికి** 1.చందనం 2. అగరు, 3. కర్పూరం 4. గోరోచనం 5. చౌరం 6. జటామాంసి 7. కపి, 8. కుంకుమ.

**శివునకు** 1.జలం 2. కుంకుమపువ్వు 3. కుష్ఠం 4. చందనం.

**సూర్యునకు** 5.రక్తచందనం 6. తగరు 7. అగరు, 8. కర్పూరం.

స్వర్గమందుకాని, తీర్థములందు కాని, ఓషధులలోగాని, ఆకాశము నందుకాని, దేవతలు లేరు. సాధకులకు ఫలితమిచ్చుటకు దేవతలు మంత్రరూపులై బీజాక్షరమందున్నారు. వైదికమంత్రములు సువర్ణమువంటివి. వీటివలన నరులు ఎన్నటికి దుర్గతి పొందరు. తంత్ర-మంత్రములు రజతము వంటివి. ఇవి ఈజన్మయందే సిద్ధినిచ్చును. జన్మాంతరము వరకూ సిద్ధినిచ్చు శక్తిగలవికావు.

వామాచారులు ఎడమచేతితో ఆచమనము చేయవలెను. తాంత్రికులు శివగాయత్రి జపంచేయాలి. ఓం తన్మహేశాయ విద్మహే. వాగ్విశుద్ధాయ ధీమహి, తన్నో శివఃప్రచోదయాత్ ॥

కామక్రోధములచేత, స్త్రీలచేత జయింపబడిన కలియుగమందు శిష్యుడెక్కడ? గురుమంత్ర మెక్కడ? జపమేమిటి? సిద్ధులేమిటి? కలియుగమందు 10వేల సం॥లు గడచిన పిమ్మట, భూమియందు సాలగ్రామశిల ఉండదు. 15 వేల సం॥లకు గంగానది, 22590 సం॥లకు, దేవతా విగ్రహ శిలలు ఉండవు. కలియుగమునందు జపమూ, సాలగ్రామార్చనలు మాత్రమే శ్రేష్ఠమైనవి. దానము చాలా గొప్పది. పూజా సమయమునందు ఆవాహనీ ముద్రచే దేవతల నాహ్వానింపవలెను.

మూలమంత్రమును 3సార్లు జపించవలయును. ఆస్థాపనీ ముద్రచే స్థిరోదేవతా అని మూలమంత్రముచే పలుకవలెను. త్వం సన్నిధేహి అని సన్నిధాపనముద్ర చూపవలెను. సమ్ముఖకరణ ముద్రచే సుముఖోభవ అనవలయును. 'అవగుంఠితోభవ' అని అవగుంఠన ముద్ర చూపవలయును



అనంతరము ధేనుముద్రచే దేవతా శిరసునందు అర్ఘ్యోదకము మూలమంత్రముచే అమృతముగా భావించి అభిషేకించవలయును.

3 సార్లు మూలమంత్రముచే, దీపినీ మంత్రముచే తడుప వలయును. (ఐం వదవద వాగ్వాదినీ ఐం క్లీం క్లిన్నే క్లేదిని క్లేదయ మహాక్షోభం కురుకురు క్లీం ఓం మోక్షం కురుకురు హౌం హౌం) అకారాది క్షకారాంతం 3సార్లు మాతృకా సేచనం చేసి, దేపతా హృదయం స్పృశించి ప్రాణప్రతిష్ఠచేసి మహాముద్ర చూప వలయును. అనంతరము షోడశోపచారములు చేయవలయును.

1. ఆసనం, 2. స్వాగతం, 3. అర్ఘ్యం, 4. పాద్యం, 5. ఆచమనీయం, 6. మధుపర్కం, 7. ఆచమనం, 8. స్నానం 9. వస్త్రం, 10. అలంకృతి, 11. గంధం, 12. పుష్పం 13. ధూపం, 14. దీపం 15. నైవేద్యం, 16. హారతి.

పత్ర-పుష్పములు అథోముఖముగా సమర్పించరాదు పుష్పాంజలికి ఈ నియమంలేదు. తులసి-బిల్వం-సంపెగలు మరునాడు కూడా వాడవచ్చు. మొగలి-మోదుగు పూలతో శివుని పూజించరాదు. అక్షతలతో విష్ణువును, దూర్వాతో దుర్గను, మారేడుతో సూర్యుని, తులసితో గణపతిని పూజించరాదు. గణపతి సూర్యులకు ఎర్రపుష్పములు ప్రీతికరం. ఓం జయధ్వని మంత్రమానే స్వాహా అని పఠించిఘంటానాదము చేయుచూ (ధూపదీప సమయములందు విశేషముగా చేయవలెను) కపోతభ్రమణ పద్ధతిలోచుట్టూదీపం త్రిప్పవలయును. కుడిప్రక్క ఆవాలు నూనెదీపం, ఎడమప్రక్క నువ్వులనూని దీపము ఉంచవలయును.

చతురస్ర మండలముచేసి బంగారుపాత్రలో నైవేద్యము పెట్టవలయును. అస్త్రమంత్రముతో జలము నంప్రోక్షించి, చక్రముద్రచూపి, స్పర్శదృష్టి దోషములు తొలగుటకు 'యం' అను బీజము పఠింపవలయును. తరువాత 'రం' అను అగ్నిబీజముతో స్పృశించి, "వం" అనుఅమృత బీజముతో

అమృతీకరించి 8సార్లు మూలమంత్రముతో అభిమంత్రించి నైవేద్యము చేయవలెను. తరువాత నమస్కారముచేసి దేవతయొక్క కుడిచేతియందు నీళ్ళు వదిలి అమృతో వస్తరణమసి స్వాహా అనవలయును. తరువాత హారతి, క్షమార్పణస్తోత్రం జపంచేసి, జలముతో దేవతార్పణచేసి ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు అని, దేవతను "ఓం భూర్భువఃస్సువః స్వాహా" అని, దేవతను "ఓం భూర్భువఃస్సువః స్వాహా" అని ఉద్వాసన చేయవలెను. గచ్ఛగచ్ఛ సురశ్రేష్ఠ స్వస్థానం పరమేశ్వర॥ యత్తే బ్రహ్మాదయోదేవాః నవిదుః పరమంపదమ్॥ అనవలెను.

# పురశ్చరణ

**శ్లో॥ "జపో హోమస్తర్పణం చ మార్జనం విప్ర భోజనం ।**
**పంచాంగక స్వరూపంతు పురశ్చరణ ముచ్యతే ॥**

పురశ్చరణ 5 అంగములతో కూడినది.

1. జపము యొక్క దశాంశము, హోమము 2. హోమము యొక్క దశాంశము తర్పణం, 3. తర్పణము యొక్క దశాంశము మార్జనము, 4. మార్జనము యొక్క దశాంశము, బ్రాహ్మణ భోజనము, కావించినచో 'పురశ్చరణ' పూర్తియగును. అపుడే మంత్రము సిద్ధించును. కౌళ మతములో షోడశాంగ పురశ్చరణ కలదు. ఋగ్వేదీయులు వారి గృహ్యసూత్రాను సారముగా అగ్నిని ప్రతిష్ఠించి "అగ్నేనయ సుపథారాయే" అను సూక్తముతో నెయ్యి హోమం చేసి, అగ్నయే స్వాహా అగ్నయే ఇదం నమమ అని చెప్పవలెను. తరువాత పురుషసూక్తముతోను, 'అగ్నే ర్మన్వేతి ప్రథమస్య' అను 22ఋక్ మంత్రములతో హోమం చేయవలయును. పవమాన సూక్తముతో (17 ఋక్‌లు) హోమము చేయవలెను. అజ్ఞానమువల్ల, ప్రమాదమువల్ల ఈ జన్మమునందు చేసిన పాపపరిహారార్థం 'కూష్మాండ హోమం' చేయ వలయును.



# జపస్థానములు

సకల దేవతలకు, కృత్రిమ అకృత్రిమ జపస్థానములు కలవు ఆయాస్థలములందు ఆ దేవతల మంత్ర జపమువలన శ్రీఘ్రముగా సిద్ధించగలరు. ఇవి తంత్రగ్రంథములో చాలా రహస్యముగా నున్నవి. నర్మదానదీతీరమునందు, మాహూరం ఉజ్జయినీ, గణపతి సిద్ధిక్షేత్రములు, ప్రభాసం, కురుక్షేత్రం, పుష్కరం, భృగుపర్వతం, యమునా నదీతీరం-కాశి-సూర్యమంత్ర సిద్ధిస్థానములు, అయోధ్య, మధుర, మాయాకాశి, బద్రీనాథ్, గయ, ద్వారక, గండకీ నదీతీరం విష్ణు మంత్ర సిద్ధిస్థానములు కాశి, కేదారం, త్రయాంబకం, కాంచి ఉజ్జయిని, అరణ్యములు, గంగాతీరం, వైద్యనాథం, రామేశ్వరం శివసిద్ధికరములు.

జ్వాలాముఖి, ప్రయాగ, మాలికాపదం-కామిని-సరస్వతీ నదీతీరం శక్తిమంత్ర సిద్ధిస్థానములు. అంగ-వంగ-కళింగములు కమలేశ్వరీ తీరము-ఏకల-యక్షపర్వతం- క్షుద్ర దేవతాసిద్ధికరములు. కామరూపం (అస్సాం)-వింధ్య జలంధర్, పూర్ణగిరి వామాచార సిద్ధికరములు. పద్మసరస్సులు, అరటి వనములు, జిల్లేడుగల ప్రాంతము, వైడూర్యములు గల భూమి గణపతికి ప్రియంకరములు, పద్మ సరస్సులు, అరణ్యము, కరవీర, జిల్లేడు వాటికలు, గోధుమ, వరిపొలములు-శిలాప్రదేశము, సూర్యప్రీతికరములు.

తులసి. రావి-ఉసిరి-చెరకు-సాలగ్రామ సన్నిధి, ఆవుల కొట్టం, శ్రోత్రియులున్న గ్రామం, విష్ణుప్రియములు పశ్చిమాభిముఖలింగ శివాలయము, నందిలేని శివాలయము-శివమందిరమునకు దగ్గరనున్న మర్రి, అరణ్యము-సరస్సు-అరటివనం-గండకీ నదీతీరం, శివశక్తి ప్రీతికరములు. చిన్న నీటిగుంటలు, నిమ్మపుట్టలు, ఎండిన నదీప్రాంతములు క్షుద్రదేవతా ప్రీతికరములు. శ్మశానము-మూడు లేదా నాలుగు మార్గముల

కూడలి. శూన్యాలయం-శవమున్న చోటు వామదేవతలు సంతోషింతురు గృహము. పశుశాల, తోటలు పర్వత శిఖరములు నదులు, నదీసంగమ స్థానములు దేవాలయములు వైదికులకు బలీయములు.

స్థాననిర్ణయముచేసి సాధకుడు (అముక) మంత్రస్య పురశ్చరణ సిద్ధయే, మయా ఇయం గృహ్యతే భూమిః. మంత్రోయం సిధ్యతాం! అని భూమిని, వరాహమును-కుజుని పూజించవలెను. మర్రి కర్రలను 10 కీలలుగా తీసుకొని అష్టదిక్కులయందు పాతి, ఊర్ధ్వ అధోబుద్దితో తొమ్మిదవ కీలమధ్యలో పాతి, పశ్చిమ-నైరుతుల మధ్య పదవకీల పాతవలెను. అస్త్రమంత్రముచే మంత్రించి, ఇట్లు 10 కీలలు వేసినచో, సాధకునికి విఘ్నములు కలుగవు. దిక్పాలకులకు ఆదిశలయందు మినపరొట్టి బలిఇవ్వవలెను, క్షేత్రమధ్యమందు, క్షేత్ర పాలకునికి, గణపతిని ప్రార్థించవలెను. తరువాత వాస్తుపురుషుని పూజించి, క్షేత్రమధ్యమందు 'కూర్మ చక్రము' లిఖించి దానిపై కూర్చుని జపము చేయువలయును. పర-దేశ-గ్రామ-గృహ భేదములతో కూర్మచక్రము 4 రకములు. కురుక్షేత్రం-ప్రయాగ-గంగా సాగర సంగమస్థానము- ఉజ్జయిని-కాశీక్షేత్రము ఈస్థానంలందు కూర్మస్థానము కల్పించ నవసరము లేదు. క్షేత్రం సాధకుడు-మంత్రం, ఈ మూడింటికి మొదటి అక్షరము ఒకటే అయినచో, దానిని 'ధృవ మంత్రం' అందురు. అది సర్వసిద్ధులను ఇచ్చును.

## జపమాల

ఇది స్థిర, చర అని రెండు విధములు స్థిరచిత్తులకు స్థిరమాల, చరచిత్తులకు చంచలమాల. అకారాది క్షకారాంతము బిందువుతో కలిపి, అనులోమ విలోమముగా జపించుమాల "వర్ణమాల. 15 పూసలుగల మాల అభిచార క్రియలకు మంచిది. మోక్షమునకు 25- ధర్మసిద్ధికి 30 కోరినకోర్కెలకు 54 సకల సిద్ధులకు 108 పూసలు గలది శ్రేష్ఠము.



రుద్రాక్షమాల సమస్త సిద్ధులను ఇచ్చును. మణులమాల ధనమును-శంకమాల నష్టద్రవ్యమును ఇచ్చును. స్ఫటికమాల భోగమును సంతానమును పద్మమాల పుట్టిని - వైడూర్యమాల వశీకరణమును-ముత్యముల మాల ముక్తిని ఇచ్చును. పసుపుకొమ్ము స్త్రీవశ్యం-జిల్లేడు పూసలు ఉచ్చాటన-మారేడు జ్ఞానసిద్ధి-దేవదారు ఆరోగ్యం-నత్తగుల్లలతో తామసక్రియలు-గజ దంతములతో సకలసిద్ధులు-రాగిపూసలు మోహనం. ఇనుప పూసలు మారణం-తెల్లతామర పూసలు ధనమును-ఎర్రచందన మాల యక్షిణి సాధనకు-నిమ్మపూసలు భూతస్తంభనకు-జమ్మిపూసలు జన స్తంభనకు-నేలనిమ్మ రోగస్తంభనకు-కోతి ఎముకల పూసలమాల అభిచార క్రియలకు-ఎలుకల మాల వనసిద్ధికి, పులి ఎముకపూసల మాల వనదేవతాసిద్ధికి నరఎముక పూసలమాల రాక్షస వశీకరణకు- గుర్రం ఎముకపూసలమాల వీరుల వశీకరణకు-గాడిద ఎముక పూసల మాల క్షుద్రసిద్ధులను ఇచ్చును. రుద్రాక్ష-స్ఫటిక-ఇంద్రాక్షుల మాలలతో మరొకరకం పూసలు కలిపి గ్రుచ్చరాదు.

అటువంటిమాల కామ-మోక్షములను నాశనమొనర్చును గణపతి మంత్రజపమునకు చవితినాడు మాలగ్రంధించవలయును సూర్యునకు సప్తమిరోజు మధ్యాహ్నము ద్వాదశియందు వైష్ణవీమాల- త్రయోదశి సాయంకాలము శివమాలిక-అష్టమీ-నవమి-చతుర్దశి యందు కుజమాలిక- శుక్ల పక్ష రాత్రియందు శక్తిమాలిక ఆయా మంత్రములతో కూర్పవలయును.

## రుద్రాక్షలు

ఉసిరిఫల సమానమైనవి ధారణకు శ్రేష్ఠం. రేగుపండుతో సమానమైనవి మధ్యమం శనగగింజలతో సమానం అధమం ఆపదలు కలిగించును. పెద్దపూస నుండి క్రమంగా మాలగ్రుచ్చి 1 మేరుపూస గ్రుచ్చవచ్చు. రుద్రాక్షలు

తెలుపు-ఎరుపు-నలుపు రంగులలో ఉండును. వీటిలో తెలుపు శ్రేష్టమైనది. ఎక్కువ బరువుగా నున్నది-మరీచిన్నది-విరిగినది-పాతది అయిన రుద్రాక్ష మంచిదికాదు. ఒక రుద్రాక్షతో మరొకటి స్పృశించి దగ్గరగా నుండరాదు. రెండింటి మధ్య ఉండాలి ఏకముఖ రుద్రాక్ష శివస్వరూపము బ్రహ్మహత్యాదిమహాపాతకములను పోగొట్టును ద్విముఖీ ఉమాశంకరమనబడును గోహత్యాపాపము పోగొట్టి గృహస్థులకు సౌఖ్యము నిచ్చును.

త్రిముఖ అగ్నిస్వరూపము స్త్రీహత్యా పాపము పోగొట్టి, ధర్మార్థ-కామములు ఇచ్చును. చతుర్ముఖ బ్రహ్మస్వరూపము విద్యాభివృద్ధి- వాక్సిద్ధి ఇచ్చును. పంచముఖ సాక్షాత్తు శివుడే శివగణేశశక్తి మంత్రములు సిద్ధించును. షణ్ముఖి కార్తికేయం కుడిభుజమునకు ధరించిన కోర్టు వ్యవహారములందు జయము కలుగును సప్తముఖి మహానాగుడు అనంతుడు. సర్పదోషము పోవును. అష్టముఖి గణపతి స్వరూపము. సర్వవిఘ్నములు తొలగును వీటిని మాలతో జపించుట వలన కామక్రోధములు నశించును. నవముఖి భైరవస్వరూపము దీనిని ఎడమభుజమునకు ధరించిన పాపము తొలగును. దశముఖి జనార్ధన స్వరూపము పాపములు పోగొట్టి భూత-గ్రహబాధలను తొలగించును.

ఏకాదశముఖి రుద్రస్వరూపము దీనిని ధరించుట వలన "అశ్వమేధ యాగఫలము" కలుగును. ద్వాదశముఖి సూర్య స్వరూపము తేజస్సు-గోమేధ ఫలము కలుగును. త్రయోదశిముఖీ విశ్వదేవాత్మకము శ్రాద్ధకాలమునందు ధరించినచో పితృదేవతలకు అక్షయగతి కలుగును. చతుర్దశ ముఖి అక్షయ ఫలితములు కలుగును. రుద్రాక్షలను ఎల్లప్పుడూ ధరించువాడు దేహాంత్యమందు శివలోకము చేరును. రుద్రాక్షమాల సర్వదేవతల మంత్రములను సిద్ధింపచేయును. రుద్రాక్ష ధరించిన పందికూడా మరణాంతరము రుద్రుని చేరును. ఇక మానవుల సంగతి చెప్పనేల? రుద్రాక్షలు ధరించనిదే బ్రాహ్మణులు ఏకర్మలూ ఆచరించరాదు.



ఒకే మాలతో వివిధ దేవతల మంత్రములను జపించరాదు. ఒక మంత్రమునకు ఒకే ప్రత్యేకమాల ఉపయోగించాలి. జపమాలకు చూపుడువేలు తగులరాదు. శిరః కంపముతో జపించరాదు. ఎడమచేతిని స్పృశించరాదు. అంగులీమాలతో కూడా జపము చేయవచ్చు. అనామికా మధ్య పర్వమునుండి జపము ప్రారంభించి, కనిష్టికామూలము ద్వారా నాలుగువ్రేళ్ళు గమించి మధ్యమ మూలపర్యంతం జపించాలి దీనినే 'కరమాల' అందురు. ఇవి దశసంఖ్య కలది అంగుళులు దూరముగా ఉంచరాదు. జపసమయ మందు, పిల్లి కోడి-గ్రద్ద-కుక్క-కోతి వీటిని చూచినచో, ఆచమనం చేసి మరల జపము ప్రారంభించాలి. ఆకలి, క్రోధం, నగ్నత్వం. ఏకవస్త్రం, బభువస్త్రం విచారం కలిగినపుడు పడుకొని, మంచంమీద, వాహనముమీద కూర్చొని జపము చేయరాదు ఇట్లు చేసినచో ఆ జపఫలము రాక్షసులు గ్రహింతురు. వాచిక, ఉపాంశు, మానసిక జపములలో, అర్ధస్మరణతో మానసికజపం ఉత్తమం. వాచిక జపంవల్ల షట్‌కర్మలూ సిద్ధించును. మానసిక జపంవల్ల మోక్షప్రాప్తి కలుగును. ధనప్రాప్తిచేత క్షుద్రమానవుడు సంతోషించును. బలిదానముచేత వామదేవతలు సంతోషింతురు. అదేవిధముగా నేను (శివుడు), నువ్వు (శక్తి) గణపతి-విష్ణు సూర్యుడు జపము వలనే ఫలప్రదులగుదురు.

# ఆసనములు

ఆసనములు రెండు రకములు నిత్యము-కామ్యము. దర్భ-జింక చర్మముతో చేసినవి. నిత్యజపమునకు, ఉపయోగింపవచ్చును. కామ్యకర్మలకు సకలసిద్ధులకు వ్యాఘ్ర చర్మము-రోగశాంతికి గొర్రుబొచ్చుతో చేసినది. ధనవృద్ధికి పేకబెత్తముతో చేసినది. ధర్మసిద్ధికి శ్వేత కంబలము, మంచివి. నీలిరంగు ఆసనము మంచిదికాదు. వెదురు దరిద్రం-వస్త్రం స్థాన వినాశనం, చెక్క దుఃఖప్రదం శిల ఉచ్చాటనం-మట్టిదిమ్మలు జ్వరకరం భూమి పేడ, ఇటికలు, గడ్డి దుఃఖప్రదం.

గురువు, గణపతి, దుర్గా, నన్ను (శివుడు) అర్చించి, ధ్యానించి, జపము ప్రారంభించవలెను. మధ్యాహ్నకాలం వరకు మాత్రమే జపము చేయవలెను.

వామమార్గ పరాయణులు బహుళ అష్టమి నుండి బహుళ చతుర్దశి వరకు 40 వేలు జపము చేసి అనంతరము పురశ్చరణ చేయవలయును. పురశ్చరణ అయిననూ కొందరికి మంత్రము సిద్ధించదు. గురువుకు సిద్ధికానిదే. శిష్యునకు సిద్ధికాదు దీనికి ఒకప్రక్రియ కలదు. ఇదిచాలా రహస్యమైనది.

మూలమంత్రమును అనులోమ, విలోమముగా బిందువుతోను, మాతృకాక్షరముతోనూ సంపుటిచేసి రోజూ 100సార్లు, ఒకనెల జపం చేయాలి. అనంతరం మరల హోమం పురశ్చరణచేస్తే మంత్రం సిద్ధిస్తుంది.

బ్రహ్మద్వేష, గురుద్వేష, స్త్రీద్వేష, శాపమువలన మంత్రము సిద్ధించినచో 8 ఉపాయ సంస్కారములు కలవు. అవి 1. సంతాపా ప్యాయనం, 2. ద్రావణం, 3. బోధనం 4. వశీకరణ, 5. పీడనం, 6. పోషణం, 7. శోషణం, 8. దహనం.

# శాబర మంత్ర పురశ్చరణ

అస్సాంలోని కామాఖ్య పీఠమునందు గురూక్తప్రకారము పురశ్చరణ చేయవలెను. గురువు లేనిచో కామపీఠపర్వత మూల భాగమునందు మూలమంత్రము వ్రాసి పఠింపవలెను. కామపీఠమే గురుస్థానీయమగును. జ్వాలాముఖి సమీపమునందుగాని, మూలమంత్రమువ్రాసి పఠింపవలెను. కామాఖ్య పీఠమునందు స్త్రీ సాన్నిహిత్యముగా మంత్రము గ్రహించ వలయును. ఇతర ప్రాంతము లందైనచో తాళపత్రముపై మూలమంత్రమువ్రాసి పూర్ణంకుంభ మందుంచి, సూర్యుని ధ్యానించి 3సార్లు మనువు పఠించినచో మంత్రోపదేశమగునట్లు భావించవలయును.



# గురువు లేకుండా తాంత్రిక మంత్రదీక్ష

❖ శుక్లపక్ష త్రయోదశియందు, తారాబలము, చంద్రబలము కుదిరిన రోజున, దక్షిణామూర్తి సన్నిధికివెళ్ళి స్వామిని పూజించి కలశస్థాపన గావించి, తాళపత్రముపై లేదా భూర్జపత్రముపై మనువు లిఖించి, కలశమందుంచి, మంత్రమును-అధిష్టాన దేవతను పూజించి, దక్షిణామూర్తిని గురువుగా భావించి, మనువును స్పష్టముగా (వ్యక్తముగా) ఉచ్చరించవలెను. అనంతరం 108 సార్లు జపము చేసినచో మంత్రదీక్షను పొందినట్లగును. గురువులయందు లోభాది దోషముండుటచేత, దక్షిణామూర్తిని గురువుగా భావించి మంత్రగ్రహణము చేయుట ప్రస్తుత కాలములో చాలా శ్రేయస్కరము.

మంత్రజపము వలన కలిగిన అకస్మాత్ సంతోషములు ఎవరికీ బహిరంగ పరచరాదు. ఇట్లు చేసినచో సిద్ధిదూరముగా పోవును. అల్పాహారం, స్వల్పనిద్ర, ఎల్లప్పుడూ మనస్సు ప్రసన్నముగా నుండుట, తేజోవంతమయిన శరీరము, సత్యసంభాషణ, ఇవి మంత్రదీక్ష గ్రహించిన 3 సం॥లకు వచ్చును నియమపూర్వకముగా చేయు జపవిఘ్నమునకు అనేకశక్తులు ప్రయత్నించును. సాధకుడు ఉద్వేగము చెందరాదు. అనంతరము 3 సం॥లకు, సాధకునికి వశీకరణసిద్ధి ప్రాప్తించి అతని మాటను ఎవరూ ధిక్కరించలేరు. హోమము చేయుశక్తిలేని దరిద్రులు మంత్రజపమునకు రెండురెట్లు తర్పణము చేయవలెను. బ్రాహ్మణ భోజనము తప్పనిసరిగా చేయవలెను. గురువు సంతుష్టి చెందునట్లుగా, గోవు, బంగారము, వస్త్రములు సద్గురువునకు సమర్పించవలయును. గురు సంతోషము చేత మంత్రము వెంటనే సిద్ధించును. పుస్తకములందలి మంత్రములను చూసి జపించుట వలన పాపము వచ్చును. కోటి మంత్రములు జపించినా అవిసిద్ధించవు. గురుముఖముగా లేదా దక్షిణామూర్తి సన్నిధియందు సంప్రాప్తించిన ఒక్కమంత్రము చాలు.

# దవన గ్రహణం

శివపూజకు పనికివచ్చు దవనమును గ్రహించుటకు చైత్ర, వైశాఖ, జ్యేష్టమాసములు మాత్రమే యోగ్యమైనవి 8-9-14 పూర్ణిమ, అమావాస్య ఈ 5 తిధులందు, మాత్రం గ్రహించవలయును. ఈ రోజులలో నిత్యకర్మలు చేసుకొని ముందురోజు సాయంకాలము నందు, దవనమూలికా సమీపమును వెళ్లి కూర్చొని, 3సార్లు ప్రాణా యామము చేసి, ఋష్యాదిన్యాసము చేసి;

**'కామభస్మ సముద్భూత రవిపోష్య జలోద్భవ**
**ఋషి గంధర్వదేవాది మోహనాయ నమోస్తుతే ॥**
**సాంవత్సరిక పూజాయాః పరిపూర్ణ త్వ సిద్ధయే**
**దవన త్వంసమాయాహి క్షమస్వచ నమోస్తుతే**
**శివప్రసాద సంభూత హ్యత్ర సన్నిహితో భవ**
**శివకార్యే సముద్దేద్య నేతవ్యోసి శివాజ్ఞయా ॥**

అని స్తుతించి, ఓం క్లీం కామదేవాయ నమః శ్రీం శ్రీం శ్రీం క్రోం రత్యైనమః అని నమస్కరించి ఇంటికి రావలయును. మరునాడు దయము అస్త్రమంత్రముచేత (ఓంఫట్), దవనమును పెకలించి ఇంటికితెచ్చి జలముతో శుభ్రముచేసి, ఓం అఘోరే ఐంచ ఓంచ ఘోరే హ్రీం ఘోరఘోరతరే శ్రీం సర్వేభ్యో సర్వసర్వేభ్యో నమస్తే రుద్రరూపేభ్యః హ్రీం॥ అని మంత్రపూర్వకముగా తడుపవలెను. పూజాస్థానములో పీఠమందుంచి 9 భాగములుచేసి అష్టదళ పద్మమందు ఉంచవలెను. అనంతరం విధ్యుక్తముగా వసంతపూజ. మన్మధగాయత్రి జపించవలయును.

# ముద్రలు

**శ్లో॥ యధా బాలస్యాభినయం దృష్ట్వా హృష్యంతి మాతరః ।**
**తధాభక్త కృతాముద్రా దృష్ట్వా హృష్యంతిదేవతాః ॥**



**తా :** చిన్నపిల్లల అభినయంచూచి, తల్లులు సంతోషించినట్లు, భక్తులు ప్రదర్శించు ముద్రలుచూచి దేవతలు ఎంతో ఆనందిస్తారు. తంత్రపూజలో ముద్రలకు అధికప్రాధాన్యం ఉన్నది. మనసులో మంత్రం భావించి, హస్తముల ముద్రలతోనే తంత్రపూజ జపించాలి. పూజాసాఫల్యానికి ఇవి ఎంతో ఉపయోగిస్తాయి.

1. అంకుశముద్ర, మధ్యవ్రేలి వెనుకకు అనామిక, కనిష్ఠికచేర్చి, తర్జనీ, అంగుష్టములను వక్రముగా చేసి, మధ్యమ వ్రేలిని సరళముగా నుంచవలయును. 2. శిరోముద్ర, నాల్గువ్రేళ్ళు చాపి హస్తతలమును బ్రహ్మరంధ్రముపై నుంచవలెను. 3. శిఖాముద్ర, అంగుష్టము తెరచి పిడికిలిమూసి పిలకస్థానము నందుంచ వలెను 4-కవచ-ముద్ర చేతులతో భుజములు స్పృశించి నాభిని స్పృశించవలెను. కుడిచేతితో ఎడమ భుజము. ఎడమచేతితో కుడిభుజము తాకవలెను. 5- త్రినేత్రముద్ర. కుడిచేయి చూపుడువేలు కుడికన్నుపై మధ్యవేలు లలాటముపై అనామిక ఎడమకన్నుపై ఒకేసారి తాకవలయును. 6. ద్వినేత్రముద్ర, చూపుడువేలు కుడికన్నుపై, మధ్యవేలు ఏడమకన్ను తాకవలెను. 7. క్షోభిణిముద్ర, 2. తర్జనులుచాపి మిగిలిన 3 వేళ్ళు నఖం తాకునట్లు ఎదురెదురుగా తాకి,2, బొటనవేళ్ళను కనిష్టిక మధ్యపర్వమందుంచవలెను.

8. ద్రావిణిముద్ర, 2. తర్జని, మధ్య వేళ్ళు సరళముగా ఎదురెదురుగా నుంచి కనిష్ఠి, అనామికలు గోళ్ళు కలిపి బొటనవేలు చేర్చవలెను. 9-హృదయముద్ర, బొటనవేలు పైకి ఉంచి పిడికిలిబిగించి, రెండు పిడికిళ్ళను హృదయమునకు చేర్చి బొటన వ్రేళ్ళతో హృదయ మధ్యమస్థానము తాకవలెను. 10-అస్త్రముద్ర, ఎడమ అరచేతితో కుడి చేతివ్రేళ్ళతో చప్పట్లు చరుచునట్లు శబ్దము వచ్చునట్లు చరచవలెను. 11-గాలినీముద్ర, కనిష్ఠాంగుష్ఠములు ఎదురెదురుగా పరస్పరము తాకి, తర్జని, అనామ. మధ్యవేళ్ళు పరస్పరము వంకరలేక తాకవలయును. 12-ధేనుముద్ర, కనిష్ఠానామికలు రెండు

హస్తములవీ, తర్జనీ మధ్యమతో కుడి భుజమువద్ద ప్రదర్శించవలెను. 13, శంఖముద్ర, ఎడమచేయి బొటనవేలిని కుడి పిడికిలిలోమూసి కుడిబొటనవేలు ఎడమచేతి మిగిలిన నాలుగువేళ్ళతో తాకాలి. 14– మత్స్యముద్ర, ఎడమచేయి అధోముఖముగా నాభివద్దచిపి, దానిపై కుడిచేతిని అధోముఖముగా నుంచి రెండు బొటనవ్రేళ్ళను చాలనచేయువలెను. 15–ఆవాహినీ ముద్ర రెండుచేతులతో దోసిలిపట్టి, రెండు రెండు బొటనవ్రేళ్ళను రెండు అనామికల మూలపర్వమువద్ద తాకవలెను.. 16–స్థాపినీ ముద్ర, ఆవాహినీముద్ర పట్టి, అధోముఖముగా చూపవలెను. (స్ధాపన చేసినట్లు భావించవలెను)

17–షణ్ముఖిముద్ర రెండు పిడికిళ్ళను ఎదురెదురుగా దగ్గరగా చేర్చవలెను. 18–స్థాపనముద్ర రెండు పిడికిళ్ళను ఎదురెదురుగా దగ్గరగాచేర్చి బొటనవేళ్ళను పైకినిలపాలి. 19–అవగుంఠనముద్ర. కుడిచేయి పిడికిలిబిగించి, తర్జని నిలువుగాచాపి భూభాగము చూపించి గుండ్రముగా త్రిప్పవలెను. 20–మహాముద్ర. రెండు బొటనవ్రేళ్ళను లింకుగా వేసి మిగిలిన వేళ్ళను చాపవలెను. 21–సంరోధీనీముద్ర, 2 బొటనవేళ్ళను పిడికిలిలోనుంచి, పిడికిలి గట్టిగా బిగించాలి. 22–దంతముద్ర, ఇది గణపతికి చాలా ప్రియమైనది. పూజసమయములో ప్రదర్శించాలి. కుడిచేయి పిడికిలిబిగించి మధ్యవేలు సరళముగాచాపి ఊర్ధ్వముఖముగా చూపవలెను. 23–పాశముద్ర, ఎడమచేయి తర్జనిపై కుడితర్జనినుంచి పిడికిలివేసి కుడితర్జనితో కుడి అంగుష్ఠము, ఎడమ తర్జనితో ఎడమ అంగుష్ఠము తాకి గొలుసువలె చేయాలి 24–వశీకరణముద్ర, నాలుగువేళ్ళు పరస్పరముజొనిపి అధోముఖముగా చేపి, రెండుచేతుల బొటనవేళ్లను కలిపినిలపాలి 25–ఉన్మాదినీముద్ర, కుడిచేతి తర్జనితో కుడిచేయి ఆనామికను, మధ్యవేలి వెనుకనుంచి గ్రహించి, ఇట్లే ఎడమచేతితో కూడా చేసి రెండుచేతుల అంగుష్ఠములను లగ్నము చేయువలెను 26–విఘ్నముద్ర కుడిచేయి పిడికిలిమూసి, బొటనవేలిని, తర్జనీ–మధ్యవ్రేళ్లనుంచి, మధ్యవేలిని సరళముగాచాపి కిందకు చూపాలి.



27–మోదకముద్ర, కుడిచేయి అభయ హస్తములవలె చూపి అంగుళ్ళను కొద్దిగావంచి చూపించాలి. 28–దుర్గాముద్ర, రెండు చేతులతో పిడికిళ్ళు బిగించి శిరస్సుపై ఎడమపిడికిలి నుంచి, దానిపై కుడిపిడికిలి నుంచాలి. 29–బాణముద్ర, కుడిపిడికిలి, తర్జని చాపవలెను. 30–వేణ్మముద్ర, ఎడమచేయి కనిష్టికకు, కుడిచేయి అంగుష్ఠము కలిపి పెదవి వద్దకు చేరి వేణువువలె ఎడమ అంగుష్ఠము పెదవి! ఆన్చి అన్ని వేళను వంచి కుడిచేయి ఆంగుష్ఠతర్జని వేళ్ళూకలిపి హృదయమందుంచవలెను. 32–ప్రాణముద్ర, కుడిచేయి కనిష్టిక అనామికఅంగుష్ఠములు మూడూకలిపి నివేదన చేయాలి. (ప్రాణాయ స్వాహా) 33–ఆపానముద్ర, మధ్యమ, తర్జనీ అంగుష్ఠములు కలపాలి. 34–వ్యాసముద్ర, మధ్యమ–అనామిక, ఆంగుష్ఠములు కలపాలి. 35–ఉడానముద్ర, తర్జని, మధ్యమ, అనామిక అంగుష్టములు కలపాలి. 36– సమానముద్ర, కనిష్ఠాంగుష్టములు కలిపి, మిగిలిన 3 వేళ్ళు సరళముగా చాపాలి. ఇది త్రిపుర సుందరికి చాలా ఇష్టమైనది ఇవేగాక, షోడశోపచారములకు దశావతారమూర్తులకు ముద్రలు చెప్పబడినవి. గురుముఖముగా గ్రహించవలెను.

# పార్థివ లింగార్చన

కృతయుగమునందు రత్నలింగము, త్రేతాయుగమునందు స్వర్ణలింగము, ద్వాపరయుగమునందు పాదరసలింగం కలియుగము నందు పార్ధవ లింగము శ్రేష్ఠమైనవి.

**శ్లో॥ స్థానాష్టకే స్థితాయా మృత్నాచ సర్వార్ధ సిద్ధిదా**
**శమీగర్భాశ్వద్ధమూలే నదీకూలే చ నిర్జనే ।**
**పర్వతాగ్రేచ తీర్థేచ గోష్ఠేవా తులసీవనే**
**వటాధస్తా త్తత్రభూమిం మంత్రయేత్పార్ధయేదితి ॥**

**తా :** పార్థివలింగము చేయుటకు మట్టిని 8 స్థానములు నుండియే గ్రహించవలయును. 1. జమ్మిచెట్టు మొదలు నుండి, 2. రావిచెట్టు 3.

నదీతీరం, 4. నిర్జన ప్రదేశం, 5. పర్వత శిఖరం, 6. ఆవులశాల 7. తీర్థప్రాంతం 8. తులసీవనం.

ఓం హ్రీం పృథివ్యైనమః అని భూమిని ప్రార్థించి,

**శ్లో॥ సర్వాధారా ధరాత్వంహి పాహిమాం మృత్తి కామిమాం**
**గ్రహిష్యామి ప్రసన్నాత్వం లింగార్థం భవమేసదా ॥**

అని మట్టిని గ్రహించి, శుభ్రముగా రాళ్ళు లేకుండా చేసి ఉంచుకొనవలెను. అనంతరము పార్థవలింగార్చన చేయురోజున గణపతిని పూజించి, ఓం హరాయనమః అని మట్టిని తీసుకొని ఓం మహేశ్వరాయ నమః అని దానిని నీరుపోసి పిసికి (అంగుష్ఠ మాత్రము) లింగముచేసి ఓం శూలపాణినే నమః అని పీఠముపై స్థాపించవలెను. ఓం పశుపతయే నమః అని నీటితో తడుపవలెను. ఓం శివాయ నమః అని పంచోపచారపూజ చేయవలెను ఓం మహాదేవాయ నమః అని విసర్జన చేయాలి. హ్రీం గంగ్లాం గణపతయే గ్లాంగం హ్రీం అనుమంత్రము 8వేలు జపించాలి. అనంతరం ఐం హుంక్షం క్లీం కుమారాయ నమః ఇది 8వేలు జపించాలి. ఈ విధముగా పీఠార్చన చేసి, పార్థవలింగార్చన బ్రాహ్మణేతరులు ఈ క్రింది విధముగా చేయవలెను.

అస్యపార్థివాఖ్యస్య విద్యా చింతామణేః మనోః నిగ్రహానుగ్రహకర్తా బ్రహ్మేఋషిః కామదుఘా దేవతా॥ గాయత్రీఛందః ఓం హ్రీం హ్రౌం బీజం॥ హ్రీంశక్తిః నమః కీలకం అభీష్ట సిధ్యర్థే వినియోగః ఓం హ్రీం హ్రౌం శివాయ సర్వజ్ఞాయ అంగుష్ఠాభ్యాం నమః

ఓం హ్రీం హ్రౌం శివాయ, సర్వతృప్తాయ, తర్జనీభ్యాం నమః ఓం హ్రీంహ్రౌం శివాయ, నిత్యమలుప్త శక్తయే, మధ్యమాభ్యాం నమః ఓం హ్రీం హ్రౌం శివాయ సర్వజ్ఞాన శక్తయే అనామికాభ్యాం నమః ఓం హ్రీం హ్రౌం శివాయ నిత్యానంద శక్తయే కనిష్ఠికాభ్యాం నమః ఓం హ్రీంహ్రౌం శివాయ



అనంతశక్తి శివాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః ఇట్లే హృదయాది న్యాసం చేయాలి.

బ్రాహ్మణులు వైదికపద్ధతిలో, 'సద్యోజాతేన' మంత్రముతో మట్టి గ్రహించి, "వాసుదేవ" మంత్రముతో నీటితో మర్ధించి, "అఘోర" మంత్రముతో లింగముచేసి, 'తత్పురుష' మంత్రముతో అర్చించాలి. "ఈశాన" మంత్రతో విసర్దన చేయాలి.

పార్దవలింగము పెద్దదిగా, మరీచిన్నదిగా చేయకూడదు. పండిన నేరేడుపండు సైజులో ఉంటే సర్వసిద్ధులను ఇస్తుంది.

**శ్లో॥ పక్వజంబూఫలకారం సర్వకామ సమృద్ధిదం**
**ఆతిపుష్టేతు దారిద్ర్యం చిపిటే రోగసంభవః ।**
**మానాధికే వియోగఃస్యాత్ స్వల్పేసిద్ధిర్న జాయతే**
**ద్విఖండే తుభవేన్మృత్యుః వియోనేన సుఖం భవేత్ ॥**

**తా :** మరీపెద్దది అయితే దరిద్రం. చిట్లితే రోగం ఎక్కువ బరువైతే వియోగం. అతిచిన్నదయితే సిద్ధిశూన్యం రెండు ముక్కలయితే మరణప్రదం. యోనిలేనిదయితే దుఃఖప్రాప్తి కలుగుతాయి చాలా జాగ్రత్తగా అర్చన చేయాలి. తాంత్రికులు "ఓం హ్రౌంహ్రీం" జూంసః అనుమంత్రముతోనూ, కౌళులు పరాప్రాసాద బీజముతోనూ పూజించాలి.

ధ్యానం : **త్రిలోచనం చతుర్బాహుం సర్వాభరణ భూషితం**
**నీలగ్రీవం శశాంకం శుద్ధస్ఫటిక సన్నిభం ॥**
**వ్యాఘ్ర చర్మోత్తరీయంచ నాగయజ్ఞోపవీతికం**
**కమండలు ధరందేవం అక్షమాలాన్వితం ప్రభుం**
**వరదాభయహస్తంచ నమజ్జన వరప్రదం**
**వృషపృష్ఠ సమారూఢం ఉమాదేహార్ధధారిణం ॥**
**జటిలం కపిలందంత నఖాభిద్యోత కారిణం**

**అమృతేనాప్లుతం దివ్యం దివ్యభోగ సమన్వితం**
**దిగ్దేవతా సమాయుక్తం సురాసుర నమస్కృతం**
**నిత్యంచ శాశ్వతంశుద్ధం ధృవమక్షర మవ్యయం**
**సర్వవ్యాపిన మీశానం రుద్రంవై విశ్వరూపిణం**
**అరాధితో మనుష్యైత్వం సిద్దైః దేవాసురదిభి ః ॥**
**ఆరాధయామి భక్త్యాత్వాం మాంగృహాణ**
**మహేశ్వర ॥**

**స్వామిన్ సర్వజగన్నాధ యావత్పూజావసానకం**
**తావత్త్వం ప్రీతిభావేన లింగేస్మిన్ సన్నిధోభవ ॥**

అని ధ్యానించి, పంచోపచార అర్చన చేయవలెను. అనంతరం 8 దిక్కులను శర్వ-భవ-రుద్ర-ఉగ్ర-భీమ-పశుపతి, మహాదేవ, ఈశానులను మహాంతులను మంత్ర పూర్వక పూజ చేయాలి.

**"ఓం హ్రౌం హ్రీం హ్రూం ఓం నమఃశివాయ**

**పారిజాతాయ ప్రసన్నాయ స్వాహా"** ఈ మంత్రము 108 సార్లు జపించాలి. బిల్వఫలం, బిల్వపత్రం, నెయ్యి. తిలలు హోమం చేయాలి. 11 ఆహుతులివ్వాలి. సాష్టాంగ ప్రణామచేసి, తర్పణ చేయాలి. బిల్వపత్రములతోనూ, జాక్షలతో తర్పణ విడవాలి. 'భవశర్వాది 8 మందికి తర్పణ చేయాలి. శైవులకుగాని, బ్రాహ్మణులకుగాని, ఒక్కరికైనా భోజనం పెట్టాలి. ఈ విధంగా నెలరోజులు పార్థివ లింగార్చనవల్ల అభీష్టం సిద్ధిస్తుంది తుమ్మిపూలతో అర్చన శ్రేష్ఠం.

గమనిక :- ఇది మంత్రవేత్తల ఆధ్వర్యంలో ఏ లోపములు లేకుండా, నిష్ఠగా ఆచరించాలి. ఇచ్చట సంగ్రహంగానే వివరించ బడింది.



# వివిధ లింగార్చనల ఫలితాలు

★ బియ్యపుపిండి లింగార్చనవల్ల విద్యాప్రాప్తి-వెన్నలింగ వల్ల కీర్తి, శ్వేతాగరులింగంవల్ల బుద్ధివృద్ధి, కృష్ణాగరులింగంవల్ల ధారణాశక్తి శనగపిండి లింగార్చనవల్ల బుద్ధి వృద్ధి, ధ్యానంలింగంవల్ల నత్తిపోతుంది. పుత్రార్థి 1500 బియ్యంపిండి లింగార్చన, 50వేలు పార్థివలింగార్చన చేయాలి. భూమికోరువాడు ఇత్తడి లింగముకాని 1000 ఇత్తడి లింగములు కాని రోజుకు 3సార్లు అర్చనచేయాలి. సౌందర్యము కోరువాడు గౌరోచనలింగార్చన 3000 చేయాలి.

1000 యక్షర్ధమ లింగార్చనవల్ల అకర్షణ సిద్ధి.'' (కుంకుమ-అగరు-కస్తూరి-కర్పూరం- చందనం, ఈ 5 వస్తువులకూ యక్షకర్ధమం అనీ, మహాసుగంధం అని తంత్రశాస్త్రంలో పిలుస్తారు.)

5000 బెల్లం లింగార్చనవల్ల ప్రీతి - లక్ష బెల్లం లింగార్చనవల్ల పదవీయోగం. 11 లింగములు గోమయంతో చేసి రోజూ 3 సంధ్యలలోనూ, అర్ధరాత్రియందు 6 నెలలు అర్చించిన ధనవృద్ధి కలుగుతుంది. కృష్ణతిలల లింగార్చన 3 సు॥లు చేసిన సర్వపాపములు నశించును. 11 వెండిలింగములు నిత్యం అర్చించినచో అనేక శుభములు జరుగును.

6నెలలు ఇంద్రనీల లింగార్చనవల్ల ధనవృద్ధి 1 లక్షస్ఫటిక లింగార్చనవల్ల ప్రభుత్వం, సీస లింగార్చనవల్ల శక్తివృద్ధి, పెసరపిండి లింగార్చనవల్ల సంతోషవృద్ధి, మినపపిండి లింగార్చనవల్ల ఇష్టసిద్ధి.

కోమలమైన లింగములలో పార్థివలింగం శ్రేష్ఠమైనది. కఠినమైన వాటిలో పాషాణలింగం గొప్పది. పాషాణంకంటే స్ఫటికలింగం, స్ఫటికలింగం కంటే పద్మరాగలింగం గొప్పది. అనంతరం పుష్యరాగ లింగం, ఇంద్రనీల లింగం, గోమేధలింగం, పగడలింగం, ముత్యలింగం, వెండిలింగం, బంగార లింగం, వజ్రలింగం, రసలింగం, బాణలింగం, ఒక దానికంటే ఒకటి గొప్పవి.

అన్నిటికంటే 'బాణలింగం' సర్వశ్రేష్ఠమైనది. ఇది నర్మదానదిలో లభిస్తుంది. బాణాసురునిచేత అర్చించబడినది. బాణలింగం, స్వయంభూలింగం వీటినైవేద్యము గ్రహించవచ్చు.

బాణాలింగార్చన చేసిన, అన్నం, జలం, ప్రసాదముగా స్వీకరించవచ్చు.

**శ్లో॥ రుద్రాక్షం శివలింగంచ స్థూలం స్థూలం ప్రశస్యతే ।**
**శాలగ్రామోనార్మదశ్చ సూక్ష్మః సూక్ష్మః విశిష్యతే ॥**

**తా :** రుద్రాక్ష-శివలింగం ఎంతపెద్దగా ఉంటే అంత గొప్పవి. సాలగ్రామం-బాణలింగం, ఎంతచిన్నవిగా ఉంటే అంతశ్రేష్ఠమైనవి.

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, వైదిక మంత్రములతో శివునికి అర్చన చేయాలి. శూద్రులు తాంత్రిక పద్ధతిలో అర్చన చేయాలి.

**శ్లో॥ పంచసూత్ర విచారంచ పార్థి వే నవిచారయేత్ ।**
**యధాకథంచిద్విధినా రమణీయం ప్రకల్పయేత్ ॥**

**తా :** శివలింగము పంచసూత్రములు ప్రమాణయుతంగా ఉండాలి. పార్థివ లింగమునకు ఈ నియమం వర్తించదు ఏదోవిధంగా అందంగా ఉండేలా చేయాలి. అంగుళముల శివలింగం శ్రేష్ఠం.

రెండు లింగములు ప్రతిరోజూ షోడశోపచారములతో పూజించి, మల్లెపూలతో అర్చన, గుడం నైవేద్యం చేస్తూ 10 నెలలు ఆరాధిస్తే పుత్రసంతతి కలుగుతుంది.

9 లింగములు రోజూ మోదుగ పూలతో 5 నెలలు అర్చిస్తే ఋణవిముక్తి, ధనవృద్ధి కలుగుతాయి.

11 లింగములు ప్రతిరోజూ గన్నేరుపూలతో అర్చిస్తే స్వర్ణ, రజత, రత్నములు మొ॥ సర్వాభీష్టసిద్ధి. పంచభక్ష్య పరమాణ్ణములు నైవేద్యం పెట్టిలి. దీక్షాకాలం పూర్తి అయి, అభీష్టం నెరవేరిన తరువాత ఉద్యాపన చేయాలి. బంగారు లేదా వెండి - లేదా రాగి లింగముచేసి, "మహా శైవాఖ్య యోగ"



మందు. అనగా సోమవారం, ఆర్ద్రానక్షత్రం చతుర్దశీ తిథీ కలసినది. వీటిలో ఏ రెండు కలసినా అది "శైవయోగం" అంటారు. ఈరోజున గణపతిపూజచేసి హోమం చేసి సద్బ్రాహ్మణునకు లేదా గురువుకు దానం చేయాలి. ఏ ప్రమాణంగల లింగార్చన చేశామో దానంచేసే లింగం కూడా అదేసైజులో వుండాలి. ఆయుష్కాముడు నెయ్యితోనూ, ధనార్థి పాయసంతోను, తిలలు+ నెయ్యితోనూ హోమం చేయాలి. రాత్రి జాగరణం చేయాలి. గీతవాద్య కళలతో ఆనందంగా గడపాలి. వస్త్రాలంకార ప్రదానముచేత గురువును సంతోషపెట్టాలి.

# పంచామ్నాయములు

పార్వతి ఈశ్వరునితో ఈవిధంగా అడుగుతున్నది. స్వామి! మీరు ఒకసారి దక్షిణమార్గమును, ఒకసారి వామమార్గమును, సౌర-శాంభవ-గాణపత్య-వైష్ణవ, ఫారసిక-బౌద్ధ-పాఖండ సిద్ధాంతములు, ఒకసారి ప్రశంసిస్తున్నారు. ఒకసారి నిందిస్తున్నారు ఒకసారి దేవతాశూన్యమైన వేదాంత మార్గమును, వైదిక మార్గమును చాలాగొప్పదిగా చెబుతున్నారు ఇంతకీ ఏదిగొప్పది. ఎవరికి ఏది అనుసరణీయం నాసందేహం తీర్చవలసినది, ఇదివిని పరమేశ్వరుడు అహో ఏమి ఈ కాలప్రభావము నీవు కూడా తంత్రమార్గము గూర్చియే ఎక్కువగా ప్రశ్నించుచున్నావు. ద్వీపధర్మం, ఖండధర్మం, కులధర్మం, దేశ, కాల, జాతి ధర్మముల ననుసరించి కర్మ ప్రవర్తించును.

మానవులకు 6 ఇంద్రియములవల్ల ఏవిధముగా జ్ఞానము కలుగునో, అట్లే 6 వేదాంగములవల్ల వేదార్థ జ్ఞానము తెలియును, నరులకు 5 కర్మేంద్రియము లెట్లున్నవో, మహాకాలునకు పంచామ్నాయములునాచే చెప్పబడినవి. ఊర్ధ్వామ్నాయం- ఇది వాచికకర్మ. దీనికి వేదములు ప్రమాణములు వీటిఅంశలు ధర్మశాస్త్రములు. అంగములు పురాణములు.

దేవతలు గాయత్రీ మొ॥వారు. బీజం-క్షేత్రం, ఉపనయనం-ఆచారం ఈ నాలుగు లక్షణములు గలవారు బ్రాహ్మణులకు మేమందరము వశ్యులము. వీరికి వాక్సిద్ధి ఉంటుంది. 3 లక్షణములు మాత్రమే ఉన్నవారు వైదిక తాంత్రిక యోగ్యులు, 2 లక్షణములున్నవారు వామ దక్షిణ ఆచారవంతులు. 3 లక్షణములు లేనివారికి కేవలం తంత్రమార్గం సిద్ధిస్తుంది. 4 లక్షణములు లేనివారికి "కుల మార్గం" సిద్ధిస్తుంది. (చతుర్లక్షణ హీనానాం మార్గాస్యుః కౌళికా దయః) వామమార్గము శూద్రాది, చండాల, యవనులకు సిద్ధిప్రదం, 1. పూర్వామ్నాయం మంత్ర యోగం, 2. దక్షిణామ్నాయ భక్తియోగం, 3. పశ్చిమ్నాయం కర్మయోగం 4. ఉత్తరామ్నాయం జ్ఞానయోగం, 5. ఊర్ధ్వామ్నాయం వైదిక మార్గం, ఈ విధముగా వారి వారి యోగ్యతల ననుసరించి ఆమార్గములందు సాధనచేయాలి. భోగపరాయణులై పంచమకార సేవన చేయరాదు. అందరికీ అన్ని మార్గములు అనుసరణీయములు కావు. సత్కర్మలవల్లనే సత్ఫలితసిద్ధి.

# తాంత్రిక హోమం

హోమము చేయురోజున, తిథి-వారము కలిపి 4చే భాగించగా శేషము 3లేదా 4మిగిలితే మంచిది. అపుడు అగ్నిహోత్రుడు ప్రత్యక్ష స్థానీయుడై యుంటాడు 1-2-మిగిలితే అగ్ని స్వర్గస్థానీయుడై ఉంటాడు. ఈరోజునహోమం చేయరాదు. చేసినచో ప్రాణ- ధననాశనం. కనుక హోమం చేయురోజు కుదిరినదా? లేదా? అని పరిశీలించాలి.

హోమకుండమునకు యోని-మేఖల కంఠం, నాభి, ఉండాలి నలుచదరముగా నుండాలి. 100సార్లు హోమము చేయు హోమకుండము 6 అంగుళముల చదరముగా ఉండాలి. సహస్ర హోమమునకు 12 అం, "10 వేల వరకు 24 అం' ఉండాలి. లక్షవరకు 48 అం", ఆపైన కోటివరకు 96 అం '(8 అడుగుల చదరం ఉండాలి.



తాంత్రిక హోమము స్థండిలమందు చేయవలెను మేఖల-నాభి- యోని, కంఠములేని దానిని స్థండిలం అందురు. చదరంగా 6 అంగుళాలు మట్టివేసి దానిపై వరిపిండివేస్తే స్థండిలం అంటారు.

స్థండిలమును మూలమంత్రము పఠించి చూచి, అస్త్రమంత్రము (ఫట్)తో జలము ప్రోక్షించవలెను. తిరిగి అస్త్రమంత్రము 3సార్లు పఠించి కుశలతో కొట్టవలెను. కవచ మంత్రముతో (హుం) చేయిమూతచేసి, మరల అస్త్రమంత్రముతో స్థండిలమందు దర్భతో 1 అంగుళం తవ్వవలెను. అంగుష్ఠ అనామికా వేళ్ళతో ఆమట్టిని అస్త్రమంత్రముతో తీయవలెను. మరల శుద్ధమృత్తికతో హ్రీం అని ఆరంధ్రమును పూరించి అస్త్రమంత్రముతో సమముచేసి, కవచమంత్రముతో తడుపవలెను. మూలమంత్రముతో స్థండిలము గట్టిచేసి, కుశలతో సమ్మార్జన 'హుం' అని చేయవలెను. హుంకారముతో గోమయ విలేపనం, హుంకారముతో సోమ-సూర్య-అగ్నులను స్థండిలమందు భావించాలి హ్రీంకారముతో స్థండిలంచుట్టూ తూర్పుముఖముగా 2 దర్భలతో దక్షిణ-ఉత్తరముల లోనూ ఉత్తర ముఖముగా 3 రేఖలు పడమం, తూర్పుదిశలను గీయాలి పాంగ్ముఖాగ్రముగా విష్ణు-ఈశ్వర, ఇంద్రులు, ఉదంగ్ముఖ అగ్రరేఖలకు బ్రహ్మ-సూర్య-చంద్రులు భావించాలి.

ఈ 6గురికీ పూజచేయాలి. ఓంకారముతో షట్కోణ యోగపీఠముపై, కాలాగ్ని రుద్రుని, ఆపై శక్తిని, పైన కూర్మము, వెనుక వసుంధరను సుదాసింధువేష్టిత శ్వేతద్వీపమును భావించి పూజించాలి. 8 దిక్కులందు మధ్యన 1-ఓం జయాయై నమః 2-ఓం విజయాయై నమః 3-ఓం అజితాయై నమః 4-ఓం అపరాజితాయై నమః 5-ఓం నిత్యాయై నమః 6-ఓం విలాసిన్యై నమః 7-ఒక దోగ్ధ్ర్యై నమః 8-ఓం అఘోరాయై నమః 9-ఓం మంగళాయై నమః, అని తూర్పు-ఆగ్నేయ-దక్షిణ వరుసగా పూజించాలి. తరువాత ఓం హ్రీం సర్వశక్తి కమలాసనాయై నమః అని పుష్పాంజలి స్థండిలమందు

భువనేశ్వరీ దేవిని ధ్యానించి అర్పించాలి. ఆవాహనాది పంచోపచారపూజ చేయాలి అనంతరం అరణ్యం నుండిగాని, బ్రాహ్మణ గృహము నుండిగాని అగ్నిని, కన్య-లేదా సౌభాగ్యవతి ద్వారా తీసుకువచ్చి ఆమె ఎడమచేతి నుండి అగ్నిని గ్రహించి ఫట్ హూం అని మూలమంత్రుతో అగ్నిస్థాపన చేయాలి. తీసుకువచ్చిన పళ్ళెమును ఫట్ స్వాహా అని నైఋతి దిశలో ఉంచవలెను. రంరం రం రంరంరంరం అగ్నిబీజముతో, అగ్నిని చైతన్యవంతముగా భావించాలి, ఓం అని 5సార్లు ఉచ్చరించి ధేను ముద్ర ప్రదర్శించి, అగ్నికి 3సార్లు ప్రదక్షణ చేయాలి ఓం "చిత్పింగళ హసహన పచపచ దహదహ సర్వంజ్ఞాపయస్వాహా" అని అగ్నిని ప్రజ్వలింప చేయాలి.

**శ్లో॥ అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం ।**
**సువర్ణ వర్ణ మమలం సమిద్ధం సర్వతోముఖం ॥**

అని అగ్నిని ప్రార్థన చేయాలి.

**శ్లో॥ హిరణ్యా-కనకా-రక్తా-కృష్ణాచైవతు సుప్రభా ।**
**బహురూపాచాతిరక్తా జిహ్వాసప్తేతి సాత్వికాః ॥**

అని ఏడు నాలుకలను ధ్యానించాలి. తరువాత అంగన్యాస కరన్యాసములు చేయాలి.

**ఓం సహస్రార్చిషే అంగుష్ఠాభ్యాం నమః హృదయ**
**ఓం స్వస్తి పూర్ణాయ తర్జనీభ్యాం నమః శిరసే**
**ఓం ఉత్తిష్టపురుషాయ మధ్యమాభ్యాం నమః శిఖాయై**
**ఓం ధూమవ్యాపినే, అనామికాభ్యాంనమః కవచాయ**
**ఓం సప్తజిహ్వాయ, కనిష్ఠికాభ్యాం నమః నేత్రత్రయాయ**
**ఓం ధనుర్ధరాయ, కరతల కరపృష్ఠాభ్యాం నమః**

తూర్పుముఖముగా దక్షిణ-ఉత్తర దిశలయందు; ఉత్తర ముఖముగా పడమర-తూర్పుదిశలందు దర్భవిస్తరణ వేయాలి స్రుక్- స్రువములను,



ప్రణీతి-2, ప్రోక్షిణపాత్రలను ఆజ్యస్థాలిని అథో ముఖముగా ఉంచి, హోమద్రవ్యమును, బలిని గంధపుష్పాక్షతలను సమకూర్చుకొనవలెను. వీటిని పవిత్రముతో స్పృశించి, ప్రోక్షణి యందు నీటినిపోసి ఉ పవిత్రము లుంచవలెను. ఉత్తరదిశయందున్న పాత్ర 'ప్రణీతి' అంటారు ప్రణీతి పాత్రలోని జలము ప్రోక్షిణీ పాత్రలో పోసి, దర్భతో జలము గ్రహించి హోమ సంభారములను మూల మంత్రముతో సంప్రోక్షించాలి. స్థండిలము యొక్క దక్షిణభాగమందు కుశలను వేసి, కామకాయన విశ్వామిత్ర గోత్రోహం సంపత్ కుమారశర్మ. భరద్వాజ గోత్రిణం, శుక్రాచార్య శర్మాణం గణపతిదీక్షాంగభూత హోమే అస్మిన్ శుభకర్మణి బ్రహ్మాణం త్వాంవృణే అని దర్భలు బ్రహ్మచేతికిచ్చి వస్త్రాలంకారముచేత పూజించాలి. బ్రాహ్మణుడు లభించనిచో 'కుశబటుకుని స్థాపించాలి) ఓం సర్వశక్తి కమలాసనాయ నమః అని స్థండిలం పూజించాలి.

అగ్నికి నమస్కరించి ఓం వైశ్వా నరజాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా) అనిచెప్పి అగ్నిజ్వాలలు ధ్యానించాలి (శాంతికర్మలయందు ఈశాన్యమందు బంగారు వర్ణముతో జ్వాలలు హోమ సమయమున ఎగయును. స్తంభన కర్మయందు తూర్పుదిశలో వైఢూర్య కనకవర్ణములోను, విద్వేషకర్మ యందు ఆగ్నేయములో ఎర్రని జ్వాలలు, మారణకర్మలో నైఋతి దిశలో నల్లని కాటువంటి జ్వాలలు, ధనప్రాప్తి క్రియయందు పడమరలో పద్మరాగ ప్రభలతో జ్వాలలు, వశ్యకర్మలో వాయువ్యమందు ఇతర వర్ణములతోనూ జ్వాలలు ఎగయును. ఇంద్రధనస్సువంటి రంగురంగుల జ్వాలలు షట్కోణమందు బహుకర్మలు చేయునపుడు ఎగయును. ఆయాకర్మలు చేయునపుడు జ్వాలలు ఆయాదిశలయందు కనబడవలెను కనబడితే హోమసిద్ధి. లేనిచో విపరీత ఫలితము తెలియవలెను.

అనంతరం ఇంద్రాది దిక్పాలురను సాయుధ మంత్రములతో పూజించాలి-తూర్పున వంవజ్రాయుధ ధరాయలం ఇంద్రాయ నమః

ఆగ్నేయమునందు శంశక్తిధారిణే రం అగ్నయే నమః దక్షణమున దం దండథ రాయమంయమాదానమః నైరుతిఓ ఖం ఖడ్గధారిణే క్షంనిజుతయే నమః పడమరలో వాం షాశహస్తాయ వం వరుణాయ నమః వాయవ్యములో అం అంకుశహస్తాయ యంవాయవే నమః, ఈశాన్యంలో త్రిం త్రిశూలధారిణే హం ఈశాయ నమః అనంతరం స్రుక్ స్రువములను అధోముఖముగా అగ్నికి చూపించి కొద్దిగా వేడి చేయవలెను. (తాపనం) కుశాగ్రములతో వాటి చివర భాగమందు, మధ్యయందు మార్జన (తుడుచుట) చేయాలి. మూలమందు 3సార్లు తుడిచి మరల తాపసం చేయాలి వాటిని ఎడమ చేతితో ధరించి ప్రోక్షణిపాత్రలో జలముచే కుడిచేతితో దర్భలచే ప్రోక్షంచి, కుడికరాగ్రముచే ఆరెంటినీ తాపనము చేసి, దర్బలను అగ్నియందువేసి, అగ్నికి కుడిప్రక్కన దర్భలపై 2 పాత్రలను ఉంచవలెను.

ఆజ్యస్థాలి తీసుకొని మూలమంత్రముతో పాత్రయందు నెయ్యిని వేయవలెను. వాయవ్యమందున్న అగ్నిని 2దర్భలతో వెలిగించి హ్రీం అని నేతిలోముంచి ప్రక్కన వేయాలి. ఆజ్యస్థాలిని పైకెత్తి అగ్నియందు కొద్దిగా శిఖలపై వేడిచేసి దర్భలపై పెట్టాలి. నీరు స్పృశించి6 అంగుళాల రెండు దర్బలు తీసుకొని “ఫట్” అనుచూ నేతిని కలపాలి. అంగుష్ఠానామికలచేత నేతిని కలిపి, కుశలతో స్వాభిముఖముగా పైకి-కిందకీ కదపాలి. మరిరెండు దర్భలు గ్రహించి కొసన ముడివేసి, ఆజ్యస్థాలిలో వేయాలి. శుక్ల-కృష్ణములుగా వాటిని భావించాలి. రెండు ఇడా-పింగళానాడులోని వాటి మధ్యన శూన్య ప్రదేశమునందు సుషుమ్నా నాడిని భావించాలి.

స్రువముతో ఆజ్యస్థాలిలోని కుడిభాగమునుండి నేతిని తీసుకొని అగ్నికుడినేత్రమందు (స్థండిలములో కుడిప్రక్కన) ‘ఓం అగ్నయే స్వాహా, అగ్నయే ఇదం నమః’ అని హోమం చేయాలి. ఎడమప్రక్కనుండి మరల నేతిని గ్రహించి అగ్ని ఎడమనేత్రమందు (స్థండిలములో ఎడమప్రక్కన) ఓం సోమాయస్వాహా, సోమాయేదం నమమ అని హోమం చేయాలి



హ్రీంకారముతో పాత్రలో నేతిని మధ్యనుండి స్రువముతో గ్రహించి అగ్ని మధ్యనేత్రమందు (స్థండిలం మధ్యలోపైన) ఓం అగ్నిషోమాభ్యాం స్వాహా అగ్నిసోమాయేదం నమమ అని హోమం చేయాలి. పాత్రలో కుడిప్రక్కనుండి హుంకారముతో నేతిని గ్రహించి, అగ్ని ముఖమునందు (స్థండిలం మధ్యంనోటియందు) ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా-అగ్నయే స్విష్టకృత ఇదం నమమ అని హోమం చేయాలి.

ఓం సహస్రార్చిషే స్వాహా-ఓం స్వస్తిపూర్ణాయ స్వాహా ఓం ఉత్తిష్ఠ పురుషాయ స్వాహా ఓం ధూమవ్యాపినే స్వాహా, ఓం సప్తజిహ్వాయ స్వాహా ఓం ధనుర్ధరాయస్వాహా అని హోమం చేసి ఓంకారముతో మూలమంత్రమును పూర్వసమన్వితముగా హోమం చేయాలి. అనగా ఓం స్వాహా ఓం శ్రీం స్వాహా. ఓం శ్రీంహ్రీం స్వాహా, ఓం శ్రీం హ్రీంక్లీంస్వాహా, ఓం శ్రీంహ్రీంక్లీం గ్లౌంగం గణపతయే స్వాహా ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గణపతయే వరవరద సర్వజనంమే వశంస్వాహా ఓం శ్రీంహ్రీంక్లీం గ్లౌంగం గణపతయే పరవరదసర్వజనంమే వశమానయ స్వాహా, ఇలా దశాహుతులను ఇచ్చి సమస్తమంత్రముతో 4 సార్లు వ్రేల్చవలెను. తరువాత గురువును ధ్యానించి ఇష్టదేవతలను అగ్ని రూపముగా భావించి, నేతితో అగ్నిమంత్రముతో (ఓంవైశ్వా నరజాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా) 25సార్లు హోమం చేయాలి. స్రువముతో హోమము చేసి మిగిలినది స్రుచముతోనూ, కరముతోనూ హోమం చేయాలి. అనంతరం గంధపుష్పధూపములతో నక్షత్ర, వారరాశ్యాధి పతులను వేరువేరుగా చెప్పి నమస్కారము చెప్పాలి. ఓం ధనిష్ఠానక్షత్ర మంగళవార కుంభరాశిపతిభ్యో దేవతేభ్యో సర్వేభ్యో భూతేభ్యో నమః॥ పూర్ణాహుతి ఇవ్వాలి.

॥స్వస్తి॥

# లక్ష్మీదేవి శ్రీశైల నివాసం

లక్ష్మీదేవి కోలాసురుని సంహరించి, ఆ రక్తం త్రాగి పానమత్తు రాలైనప్పుడు, దేవతలు, బ్రాహ్మణులు పరిహసించారు. ఇది తెలుసుకున్న లక్ష్మిదేవి కోపగించి స్వర్గంమీద భూమిమీద అంతర్ధానమైంది. భూలోక స్వర్గలోకములు రెండూ నిశ్శ్రీకమై శోభావిహీనమై, ధర్మరాహిత్యముతో 100 సం॥లు దుర్భరముగా గడచినవి. అందరూ కలసి బ్రహ్మలోకం వెళ్ళి బ్రహ్మను ప్రార్థించారు. బ్రహ్మకూడా శ్రీవిలాసంలేక దరిద్రునిలా ఉన్నాడు. రెండు లోకములూ కళావిహీనమగుటకు కారణమేమిటని, బ్రహ్మను ప్రశ్నించారు. బ్రాహ్మణాపహాస్యం, లక్ష్మిదేవి పాతాళలోక గమనం బ్రహ్మ వివరించగా, ఆమెను ప్రసన్నురాలిగా చేసుకొనుటకు త్రిమూర్తులు. ఇంద్రాది దిక్పాలక దేవతలు, నాగులు, రాక్షసులు అందరూ కలసి శ్రీశైల పర్వతమునుచేరి, వైదిక తాంత్రిక పద్ధతితో మహాలక్ష్మిని ఆరాధించారు.

అనంతరం 3 సం॥ల ఆమె ప్రసన్నురాలై శ్రీశైలమందు ముందుగా ఆవిర్భవించింది. అజ్ఞానపూర్వకమైన విప్రపరిహాస కోపమును, తగ్గించుకొని అనుగ్రహించమని అందరూ ప్రార్థించారు. అపుడు శ్రీమహాలక్ష్మి పానమత్తురాలైన నన్ను పరిహసించిరి కనుక, ఇకనుంచి అందరూ నాతో జన్మించిన సురాకలశధారిణి 'శామ' సహోదరిని, దేవతాసాధనలో ప్రధానముగా గ్రహించవలెనని, స్వీకరించిన దేవతలు సంతుష్టులగుదురని నేనులేని మాయా ప్రపంచము ఏవిధముగా వ్యర్ధమైనదో, చక్రపూజలేని పూజ వ్యర్ధమైనది. చక్రపూజా విధానమును మహలక్ష్మి ఉపదేశించినది. ఇది 8విధములు, చక్రపూజా విధానములో బలి, వైదిక–స్మార్త– తాంత్రికములని 3రకములు. కౌళపూజలో పూర్వ–దక్షిణామ్నాయ సాధకులు నిసిద్ధం వేదాధ్యయన పరుడు కులద్రవ్య సేవనవల్ల నిర్ధనుడగును.

**శ్లో॥ అంతః కౌళం బహిఃశైవం జనమధ్యేతు వైష్ణవం ।**
**కౌళం తుగోపయేద్దేవి నారికేళ ఫలాంబువత్ ॥**



**తా :** కౌశమార్గ సాధకులు "రహస్యముగా" తమ పద్ధతిని ఆచరించవలెను. తమసాధన బహిరంగముచేయరాదు మనసునందు కౌళులయిననూ, బహిరంగముగా శైవమును, జనబాహుళ్యముతో వైష్ణవమును ప్రదర్శించవలెను. కొబ్బరికాయలోని నీరువలె కౌళులు రహస్యముగా నుండవలెను.

**శ్లో॥ దక్షమార్గే మాతృబుద్ధిః స్త్రీబుద్ధిః కౌళికేపథి ।**
**యస్యజాతా దృఢతరా తస్యతుష్టాతు దేవతా ॥**

**తా :** సాధకుడు శక్తిని పూజించు విధానములో దక్షిణ మార్గసాధకులు శక్తిని తల్లివలె భావించి పూజింతురు. కౌళులు శక్తిని స్త్రీవలె భావింతురు. భావనను అనుసరించి దేవత సిద్ధించును.

# 51. పీఠదేవతలు

పంచావ్నాయ దేవతలకు 51 పీఠములు కలవు ఇవి భారతదేశమందంతటా కలవు. ఇందు షష్ఠామ్నాయములో ఉపపీఠములు కూడా కలవు శక్తి అవయవములు పడినచోట శక్తిపీఠములు వెలసినవి 16 అచ్చులు, 35 హల్లుల సమిష్టి రూపం 'మాతృకాస్వరూపం' అకారం కామరూప పీఠం అస్సాంనందు కలదు. దీనినే ఆదిపీఠం అందురు. ఇచ్చట నాచేత "కులమార్గం" బోధించ బడినది. ఇచ్చట నీయోని పడినది. కనుకనే నేను కులమార్గమును ఉపదేశించితిని. ఇది జ్ఞానదాయకము, ముక్తిని ఇచ్చునది. పంచ'మ' కార సాధనవల్ల శీఘ్రసిద్ధి కలుగును. ఇది శ్రీవిద్యకు మూలస్థానము. కనుకనే ప్రతీనెల ఈ పీఠమునందు రజోదర్శనమగును. దీనికి 2 ఉపపీఠములు కలవు. వంశపీఠము రోమముల నుండి ఉద్భవించినది ఇచ్చట శాబర–చేటకీ మంత్రములు సిద్ధించును.

ఆకారము కౌశికాపీఠము దీనికి ప్రళయ కాలమందు కూడా నాశనములేదు, ఇచ్చట పాపమూలేదు. దేహత్యాగంకంటే పుణ్యము లేదు.

పార్వతీ! నీస్తనద్వయమునుండి ప్రభవించిన 2ధారలూ వారణ+అసి, అనే రెండునదులుగా ఏర్పడి "వారణాసి" అను నామాంతరమును పొందినది. ప్రాచీన నామము 'కాశి'. ఇచ్చట బహిరంగముగా ఎచ్చటైననూ మంత్రజపము సద్యఃసిద్ధిని ఇచ్చును. గంగానది అవతల ఒడ్డున వ్యాసశాపముచేత గర్దభక్షేత్రము ఏర్పడినది ఇచ్చట దక్షిణామ్నాయ మంత్రములు సిద్ధించును. కాశికి ఉత్తరదిశగానున్న ఒకపీఠము 'సారనాథ్' ఇచ్చట వామమార్గము శీఘ్రసిద్ధిని ఇచ్చును.

ఇకారము నేపాల్ స్థానీయము. ఇది వామ మార్గమునకు మూలస్థానము. ఇచ్చట 56 లక్షల భైరవీ భైరవులున్నారు. 2300 పీఠశక్తులున్నవి. 14 శ్మశానములున్నవి. దక్షిణామార్గమునకు సిద్ధికొరకు 8 పీఠములు మాత్రమున్నవి. వైదిక మార్గమునకు 4పీఠములున్నవి. నేపాల్‌నకు తూర్పుదిశగా, కిరాతుల భూము లున్నవి. 30 వేలమంది దేవజాతులు అచ్చటనున్నారు.

ఈకారమునకు రౌద్రపర్వతము ఉత్పత్తి స్థానము ఇచ్చట అమ్మవారి ఎడమకన్ను పడినది. వామాచారమునకు ప్రసిద్ధి చెందినది. దేవతల దర్శనమగును.

ఉకారము కాశ్మీరపీఠం, ఇచ్చట ఎడమచెవి పడినది. అన్నివిద్యలకు పరస్థానము. వైదిక, స్మార్త, కౌళిక దక్షిణాచారు లెవరయినా, ప్రాయశ్చిత్తార్ధము సద్యఃసిద్ధినిచ్చు తీర్థములు కలవు. కలియుగమందు ఇవినాచే గుప్తము చేయబడినది.

ఊకారము కన్యాకుబ్జపీఠం (యిపుడు దీనిపేరు కనౌజ్) ఇచట కుడిచెవి పడినది. గంగా-యమునల మధ్యప్రదేశము "అంతర్వేది" అని పిలువబడును. ఇచ్చట బ్రహ్మాది దేవతలు వారివారి తీర్థములు సృజించిరి. ప్రతీ అడుగునందూ వైదిక మార్గ సిద్ధినిచ్చు ప్రభావశాలి, దీనికి ఉపపీఠం ఇంద్రప్రస్థం. ఇచ్చట



మరచిన వేదమును మరల బ్రాహ్మణులు పొందారు యిచ్చటనే "కాళిదేవి" తపమాచరించి, మహాకాలుని నుండి వరము పొందినది.

ఋకారము పూర్ణగిరిపీఠము. ఇచ్చట అమ్మవారి "నాసిక" పడినది. యిచ్చట మంత్రాధిష్ఠాన దేవతలు ప్రత్యక్షముగా కనిపింతురు. అర్బుదాచలం ఒకపీఠం. యిచ్చట శక్తి అంబికాదేవి వామాచారులకే సులభతరం సహస్రభగ సంగమంవల్ల వారికిముక్తి. దివ్యస్త్రీలు విహరింతురు. దక్షణాచారమువారికి యిచ్చట విఘ్నములు కలుగును. యిచ్చట బ్రహ్మచర్యం అసాధ్యం. బౌద్ధసన్యాసులు కూడా స్ఖలితులగుదురు. ఇది నాప్రతిజ్ఞ. ఇచ్చట 12 సం॥లు బ్రహ్మచర్యం నాకే సాధ్యము.

ఒకారము ఆమ్రతకేశ్వర పీఠము. కుడి గండస్థలము (చెక్కిలి) పడినది. ధనదాయక్షిణ మొ॥గు యక్షిణీ మంత్రములు ఇచ్చట సిద్ధించును.

ఓకారము ఏకామ్రేశ్వరం. ఇచ్చట గోళ్ళుపడినవి. విద్యాధరులు నివసించు భూమి.

ఏకారము త్రిస్రోతం ఇచ్చట ఉదరముపై త్రివళులు (3మడతలు) పడినవి. 3 ఉపపీఠములున్నవి. బ్రాహ్మణులకు గొప్ప సిద్ధినియిచ్చును. పౌష్టిక కర్మలకు ఎంతో శ్రేష్టము.

ఐకారము కామకోటి పీఠము. ఇచ్చట నాభి (బొడ్డు) పడినది. ఇచ్చట కామమంత్రములన్నియూ సిద్ధించును. కామినీ ఉపాసనచేత 16వేలమంది స్త్రీలతో సంభోగించు శక్తి కలుగును. 4 దిక్కులందునూ ఉపపీఠములున్నవి. ఇది అప్సరసలకు స్థానము. స్త్రీదేవతా మంత్రములన్నియూ సిద్ధించును.

ఓకారము కైలాసపర్వతం ఇది హిమాలయ పర్వతములమధ్య ఉన్నది. ఇచ్చట వేళ్ళుపడినవి. పర్వములు శివలింగములైనవి. కరమాలచేతనే (వేళ్ళపై చేయుజపం) మంత్రదేవత సంతోషము చెంది సిద్ధినిచ్చును.

ఔ-కారము భృగుపీఠము. అద్భుతమైన ఈ పీఠస్థానమునందు దంతములు పడినవి. ఇచ్చట సమస్త వైదిక మంత్రములు సద్యః సిద్ధించును.

అంకారము కేదారపీఠము. ఇచ్చట కుడిచేయి పడినది దీనికి ఉపపీఠము అగస్త్యాశ్రమం ఇందు కంకణము పడినది. ఇంద్రాక్షి పీఠమునందు ఉంగరము పడినది ఇచ్చట ఇంద్రుడు తపస్సు చేశాడు. రేవతీ తీరమునందు గాజులు పడినవి. ఇచటనున్న రాజరాజేశ్వరీదేవి ఎంత పతితుడనయినా ఉద్ధరించు దయామూర్తి. వామాచారము చేతకూడా శీఘ్రసిద్ధులు కలుగును.

అః కారము చంద్రపీఠము. ఇచ్చట ఎడమ చెక్కిలి పడినది. అన్ని మంత్రములు సిద్ధించును.

క-కారము శ్రీపీఠము. యిచ్చట శిరస్సు పడినది. పాపాత్ములు సాధారణముగా ఈ పీఠమును దర్శించలేదు. అన్నిశక్తులు రాత్రియందు స్వేచ్ఛగా విహరించును. ఆచారవంతులను ఇవి బాధించవు. దీనికి తూర్పుదిశన చెవిపోగు పడినది. బ్రహ్మవిద్యను యిచ్చు **'బ్రాహ్మీ'** శక్తి ఇచ్చట నున్నది ఆగ్నేయ దిశయందు కర్ణాభరణం సగముక్కపడి, ఉపపీఠమయినది. ఇచ్చట మాహేశ్వరీశక్తి ఉన్నది. దక్షిణభాగమున **"పత్రవళి"** పడి ఉపపీఠమయినది ఇచ్చట శక్తి కౌమారీ ఈమె జయించు శక్తులనిచ్చును. నైఋతి దిశయందు కంఠమాలపడి, వైష్ణవీశక్తి నిలచినది. ఇంద్రజాల సిద్ధినిచ్చును. పశ్చిమదిశలో నాసామౌక్తికం వడినది. ఈఉపపీఠమును వారాహీశక్తి అధిష్టించినది ఈమె శతృజయము నిచ్చును. వాయవ్యభాగమున శిరోభూషణం పడినది. అధిష్ఠానదేవత చాముండాదేవి క్షుద్రదేవతా శక్తుల సిద్ధినిచ్చును. కేశాభరణము (రాగిడి) ఈశాన్యభాగమునందు పడినది. అధిష్ఠానదేవత శ్రీమహాలక్ష్మీ యిచ్చట శ్రీసూక్తాది మంత్రములు సిద్ధించును.

ఖ-కారము అమరకంటక క్షేత్ర పీఠము ఇచ్చట కుడిభుజము పడినది. అధిష్ఠాతి నర్మద. ఉత్తరదిశలో కంచుకి (రవిక) పడినది. ఇదియ్యే జ్యోతిష్మతీ ఉపపీఠము జ్యోతిషశాస్త్రము ఇచ్చట సిద్ధించును, వక్షఃస్థలమువడి జ్వాలాముఖీ పీఠమునుండి ఏర్పడినది. అగ్నిదేవుడు, జ్వాలాదేవి తపస్సు చేసిరి. ఇచ్చట హోమమువల్ల సకలమంత్రములు సిద్ధించును. ఇచ్చటనే నవనాథు సిద్ధులలో



ఒకడైన **"గోరఖ్‌నాథుడు"** అష్టసిద్ధులను పొందెను ఈపీఠదర్శనం ఎంతో పుణ్యప్రదమైనది

ఘ-కారము మాళవపీఠం ఇచ్చట ఎడమ భుజము పడినది. ఇచ్చట గంధర్వులు శక్తినుపాసించి సంగీత జ్ఞానమును పొందిరి.

ఙ-కారము కులాంతక పీఠము. ఇచ్చట కుడిబాహుమూలము పడినది. ద్వేషోచ్చాటన మారణ మంత్రములు సిద్ధించును.

చ-కారము కోటకపీఠము. ఇచ్చట ఎడమ బాహుమూలము పడినది. ఇచ్చట రాక్షసులు 'దేవజయం' అనుశక్తిని పొందిరి.

ఛ-కారము గోకర్ణ పీఠమునందు పుట్టినది. ఇచట (జఠరము) జీర్ణాశయము పడినది.

జకారము మాతుకేశ్వర పీఠము శివమంత్రములు సిద్ధించును.

ఝ-కారము అట్టహాసపీఠం. ఇచట గణపతిమంత్రములు సిద్ధించును.

ఞ-కారము విరజాపీఠం.

ట-కారము రాజగృహపీఠము (బీహార్) ఇచ్చట "బస్తి" పడినది. సమస్త విష్ణుమంత్రములు సిద్ధించును. దీనికి ఉపపీఠము క్షుద్రఘంట. యిచట గంటలు పడినవి. ఇంద్రజాలవిద్యలు సిద్ధించును.

ఠ-కారము మహాపథపీఠము. నితంబము పడినది. అఘోరాది మంత్రములు సిద్ధించును.

డ-కారము కొల్హాపురి పీఠము. ఇచ్చట (జఘనం) నడుము పడినది. సమస్త వనదేవతా మంత్రములు సిద్ధించును.

ఢకారము ఏలాపురీ పీఠము, యిచ్చట కుడితొడ పడినది, ణ-కారము, కాళేశ్వరపీఠము, యిచట ఎడమతొడ పడినది. యిచట మృత్యుంజయ మంత్రములు, ఆయుష్కరణమంత్రములు సిద్ధించును.

త-కారము జయంతీపీఠము. యిచ్చట కుడిమోకాలు పడినది. ఇచ్చట ధనుర్వేదము సిద్ధించును.

థకారము ఉజ్జయినీ పీఠము. యిచ్చట ఎడమమోకాలు పడినది. అన్ని కవచములూ యిచ్చట సిద్ధించును.

**శ్లో॥ సిద్ధ్యై కవచమంత్రాణా మవంతీతి నిగద్యతే ॥**

ద-కారము, యోగినీపీఠము. (ఒరిస్సా) యిచ్చట కుడి జంఘా (మత్త) పడినది యిచ్చట కౌళ-వామ మంత్రములన్నీ సిద్ధించును. ఇతరములు సిద్ధించవు.

ధ-కారము క్షిరికా పీఠము. యిచ్చట ఎడమ జంఘ పడినది, భేతాళ-శాబర మంత్రములు సిద్ధించును.

న-కారము హస్తినాపురపీఠము, యిచ్చట కుడిచీల మండ పడినది, నూపురం (అందె) పడినది. యిచ్చటనేనూ పుర వర్ణమను ఉపపీఠము కలదు. ఇందు సూర్యమంత్రములు సిద్ధించును.

ప-కారము ఉడ్డీశ పీఠము ఇచ్చట చీలమండ పడినది. ఉడ్డీశ తంత్రశాస్త్రము ఇచ్చట సిద్ధించును. నూపురంపడిన చోటు "డామరం" అను ఉపపీఠం.

ఫ-కారము ప్రయాగపీఠము ఇందు 'దేహరసము పడినది, ఇచ్చట తెల్లనిమట్టి లభించును, గంగా-యమున నదులమధ్య పాదాచార ప్రాంతములందు ఎముకలు పడినవి, ఇవిపడినచోట్ల బ్రాహ్మణులు వాటిపైన పీఠములు నిర్మించిరి గంగానదికి తూర్పున అద్భుతమైన 'బగళా' ఉపపీఠము కలదు. ఉత్తరదిశగా చాముడా ఉపపీఠము. గంగా-యమునల మధ్య రాజరాజేశ్వరీశ్వర పీఠము కలవు. యమునా నదికి దక్షిణమున 'భువనేశ్వరీ' పీఠము కలదు. ప్రయాగను తీర్థరాజమని, పీఠరాజమని చెప్పుదురు.

బ-కారము షష్ఠీశపీఠము ఇచ్చట కుడిమడమ (పృష్ణి) పడినది ఇచ్చట పాదుకాసిద్ధి కలుగును.



భ-కారము మాయాపురి పీఠము ఇచ్చట ఎడమ మడమ పడినది ఇచ్చట దేవ, దానవ, గంధర్వ, మాయలు సిద్ధించును.

మ-కారము మలయపీఠము (కేరళ) ఇచ్చట రక్తము పడినది రక్తాంబరాది బౌద్ధమంత్రములు సిద్ధించును.

య-కారము శ్రీశైలపీఠం ఇచ్చట ప్లీహము పడినది అన్నిమంత్రములు సిద్ధించును. వైష్ణవమంత్రములు విశేషంగా సిద్ధిస్తాయి.

ర-అక్షరము (రేఫ) హిమాలయములలోని మేరుపీఠం ఇచ్చట మెదడు పడినది స్వర్ణాకర్షణ భైరవమంత్రము శీఘ్రముగా సిద్ధించును.

ల-కారము గిరిపీఠము ఇచ్చట నాలుక కొనభాగము పడినది, ఇచ్చట జపము చేయుటవలన 'వాక్సిద్ధి సిద్ధించును'.

వ-కారము వామనపీఠము ఇచ్చట కుడి బొటనవ్రేలు పడినది ఇచ్చట జపము వలన ఉన్నతపదవులు వచ్చును.

ష-కారము మహేంద్రపీఠం ఇచ్చట మజ్జపడినది, అన్ని శక్తిమంత్రములు సందేహములేక వెంటనే సిద్ధించును.

శ-కారము వామనపీఠము ఇచ్చట కుడి బొటనవ్రేలు పడినది ఇచ్చట జపమువలన ఉన్నతపదవులు వచ్చును.

ష-కారము హిరణ్యపురపీఠం యిచ్చట రుచిపడినది అన్ని మంత్రములు సిద్ధించును.

హ-కారము త్రిస్థానపీఠం ఇచ్చట ధమనులు పడినవి అన్ని సిద్ధులు కలుగును.

ళ-కారము ఛాయాపీఠము, మాయాశక్తి సతీవేషము ధరించి నీడరూపు దాల్చినది.

క్ష-కారము ఛత్రపీఠము ఇచ్చట కేశపాశము పడినది అన్ని సిద్ధులూ కలుగును.

ఈ 51 అక్షరముల ఉద్భవస్థాన పీఠములు మాతృకా స్వరూపములగుటవలన, గొప్ప రహస్య విషయములు మంత్ర సాధకులకు వర్తించును.

***శ్రీ మహేశ్వర ఉవాచ :-***

**శ్లో॥ వైదికే కర్మణి కలౌ నరాణాంధీః సుదుర్ల భా**
**యధానావం వినాసింధుః పారమిచ్ఛంతి మానవాః**
**తేనేజ్ఞానాలౌదేవి వామే-కౌలే కృతాదరాః ॥**
**అతత్త్వజ్ఞాః వినశ్యంతి తే తుమానుష్యవర్జితాః**
**కేచిత్వద్భక్తియోగేన ఉపదిష్టా ప్రతారకైః**
**వైదికం కర్మతే త్యక్త్వా జాయంతే**
**కలేర్దశ పహస్రేషు విష్ణుఃస్థాస్యతి మధ్యమం**
**దేశే సదేవోభవతి వింధ్యే హిమవతే క్వచిత్ ।**
**యావత్పూర్ణః కలేసంధిః తావత్థాస్యత్యతఃపరం**
**స్త్రీమాంసమద్యనిరతే లోకే ధర్మపరాంగ్ముఖే**
**సర్వఏవహితే మంత్రాః చతుర్వేదేషు సంస్థితాః**
**సంధ్యాంశేతు కలేఃసర్వే త్రింశన్మంత్రాః భువిస్థితాః**
**తదాకల్కి స్వరూపస్య విష్ణోర్జన్మ భవిష్యతి ॥**

**తా :** కలియుగమునందు మానవులకు వేదకర్మలయందు బుద్ధి దుర్లభమగును. నావలేకుండా నదినిదాటు ప్రయత్నమువలె అజ్ఞానమువల్ల, మానవులు కౌళ-వామ మార్గముల నాశ్రయింతురు. తత్త్వము తెలియనివారు వీటివలన నశింతురు. దొంగసన్యాసులు చేయు భక్తిబోధవల్ల, వైదికమార్గమును విడచెదరు.

కలియుగమునందు 10వేల సం॥లు గడచిన అనంతరం అనగా క్రీ॥శ॥ 6899 దాటినతరువాత విష్ణువు మధ్యదేశము నందు వింధ్యపర్వతము, హిమాలయ పర్వతమునందు మాత్రమే ఉండును. అనంతరము కలియుగ



సంధికాలమునందు మానవులు పూర్తిగా, స్త్రీవ్యసనము, మాంసభక్షణ మద్యపానలోలురు అయినపుడు, ధర్మం లోపించినపుడు అన్ని మంత్రములు 4 వేదములందు మాత్రమే ఉండును. కలిపూర్తికి భూమధ్యభాగము (ఉజ్జయినీ)నందు ఉండును. సంధ్యాంశకాలమునందు 30 మంత్రములు మాత్రమే ఉండును. తరువాత విష్ణుకల్కి అవతారముగా జన్మించును.

# పాపనాశక ఉపవాసములు

❖ మంత్రోపదేశములు-పురశ్చరణలు చేయునపుడు దీక్ష వహించునపుడు పాపనాశనము చేయు ప్రాజ్యాపత్య, అతికృచ్ఛ, తప్తకృచ్ఛం, చాంద్రాయణం, శిశు చాంద్రాయణం. యతి చాంద్రాయణం. సౌమ్యకృచ్ఛం-స్తోమాయనం. పర్ణకృచ్ఛం- మొ॥ ఉపవాసములు కలవు.

1. ప్రాజాపత్యం, 3 రోజులు ఉదయభోజనం 3 రోజులు రాత్రిభోజనం, 3 రోజులు ఆయాచిత భోజనం (ఎవరినీ అడగకుండా ఎవరైనా ఏదైనా తినమనిఇస్తే తీసుకొని తినడం) 3 రోజులు పూర్తి ఉపవాసం ఉండటం, దీనినే 'ప్రాజాపత్యం' అంటారు. "రుద్రజపం" లో కొన్ని మంత్రముల పురశ్చకరణకు, ఈ దీక్ష చెప్పబడినది.

2. అతికృచ్ఛం- 1రోజు ఉదయం 2వరోజు సాయం 3వరోజు అయాచిత భోజనంచేసి 3 రోజులు పూర్తి ఉపవాసం ఉండాలి.

3. తప్తకృచ్ఛం, 3 రోజులు వేడినీళ్ళు. 3 రోజులు పాలు- 3రోజులు నెయ్యి తీసుకొని, స్నానాదికము అప్పుడప్పుడు చేయాలి.

4. కృచ్ఛం, పంచగవ్యము సేవించాలి. (గోమూత్రం- గోమయం- గోక్షీరం-గోదధి, గోఘృతం) కుశోదకం తీసుకొని 1రాత్రి ఉపవాసం ఉండాలి.

5. చాంద్రాయణం - శుక్లపక్ష పాడ్యమినాడు 1 పిడికెడు అన్నం ముద్ద, విదియనాడు, 2 తదియనాడు 3 చవితినాడు, 4 ఈ విధముగా

అన్నంతింటూ పూర్ణిమనాడు ఉపవాసం ఉండి, మరునాటినుంచి ఒక్కొక్కముద్ద తగ్గించుకుంటూ వచ్చి అమావాస్యనాడు ఉపవాసం ఉండాలి. చంద్రకళలననుసరించి భోజనం చేయాలి.

6. శిశుచాంద్రాయణం - ఉదయం 4 పిండములు (ముద్దలు) సాయంత్రం 4 పిండములుతిని ఆహ్నికం నిర్వర్తించాలి.

7. యతిచాంద్రాయణం - సూర్యుడు నడినెత్తికి వచ్చినపుడు అనగా మధ్యాహ్నం 12-30 గంIIకు 8 ముద్దలు హవిష్యాన్నం 2 రోజులు తినడం యతిచాంద్రాయణం.

8. సౌమ్యకృచ్ఛ్రం-6రోజులు వరుసగా ఒక్కరకము చొప్పున ఇవితిని ఉండాలి. 1. పిణ్యాకం 2. తేనె, 3. మజ్జిగ, 4. నీరు, 5 జావ.

9. పర్ణకృచ్ఛ్రం-తామరాకు జలం-దూర్వాజలం యవజలం, బిల్వపత్రజలం, కుశోదకం రోజుకు ఒకరకం నీరు త్రాగుచూ ఉపవాసం ఉండాలి.

ఇటువంటి 'కృచ్ఛ వ్రతములు' పాటించి చేయు మంత్రదీక్ష -పురశ్చరణలు అవశ్యం సిద్ధించగలవు.

# జాతవేద కల్పం

✤ సర్వార్ధ సాధకమగు జయమును కలిగించు "జాతవేద" మంత్రం. ఈ మంత్రముచేతనే జలంధరాసురుని వధించితిని. 'జాతవేదసే సునవామ' ఇత్యస్య మంత్రస్య కశ్యప ఋషిః, త్రిష్టుప్ ఛందః, జాతవేదో అగ్నిర్దేవతా - అభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః - అంగన్యాస కరన్యాసములుచేసి జపించవలెను.



**ధ్యాన శ్లోకం :-**

**"విద్యుద్దామ సమప్రభాం మృగపతిస్కంధస్థితాం భీషణాం**
**కన్యాభిః కరవాలఖేట విలసద్ధస్తాభిరా సేవితాం ।**
**హస్తైశ్చక్రధరాసిఖేట విశిఖాం పాశాంకుశా తర్జనీం**
**బిభ్రాణామనలాత్మికాం శశిధరాం దుర్గాంత్రినేత్రాంభజే!"**

# ఆగ్నేయాస్త్రం

'జాతవేదసే' మంత్రమును విలోమముగా చెప్పినచో ఆగ్నేయాస్త్ర మంత్రమగును షడంగములు విలోమముగానే చెప్పవలెను. 4444 జపంచేసి - హోమం చేయాలి. క్రూరకర్మలు మాత్రమే విలోమముగా చేయాలి. శాంతికంపౌష్టికం క్రియలు అనులోమంగా చేయాలి.

"అతిదుర్గా" మంత్రము అనులోమముగా జపించినచో సూర్యాస్త్రం విలోమంగా చేస్తే "కృత్యాస్త్రం" అగును.

# సంపదలిచ్చు కుబేర మంత్రం

అస్యశ్రీ కుబేర మంత్రస్య మేధాతిథి ఋషిః గాయత్రీ ఛందః సదసస్పతిర్దేవతా - కుబేరానుగ్రహ సిద్ధ్యర్థే జపే వినియోగః ॥

**ధ్యాన శ్లోకం :-**

**"అశ్వారూఢం కుంతపాణీం కుబేరంచిత్రిణీ ప్రియం**
**నిధీశ్వరం స్వర్ణవర్ణం వందే గంధర్వనాయకమ్ ।**
**మనుః- "సదస్పతిమద్భుతం ప్రేయమింద్రస్యకామ్య**
**త్సనింతే ధామయాశిషమ్ ॥ 22 అక్షరములు**

ఇది ముందుగా 1 నెలలో 40 వేలు 'మనోజపం' చేయాలి అనంతరం 6 నెలలు దేవతాప్రీతికి జపం చేయాలి నెలకు 40 వేలు జపం చేసినచో ధనలబ్ధి కలుగును.

# త్రిశక్తి మంత్రం

**అస్యశ్రీ త్రిశక్తి మహామంత్రస్య బ్రహ్మ - విష్ణు శివా - ఋషయః ।**

**గాయత్రీ ఛందః అగోచరం వేదగమ్యం పరంతేజో దేవతా ।**

**షడంగన్యాసములు చేయవలెను.**

**ధ్యాన శ్లోకం :-**

**"సస్యం మానవివర్జితం శృతిగిరాం ఆద్యం జగత్కారణం**
**వ్యాప్తం స్థావర జంగమే మునివరైర్ధ్యాతం, నిరుద్ధేంద్రియైః**
**అర్కాగ్న్యుఃగ్రమయం శతాక్షరవపుః తరాత్మకం సంతతం**
**నిత్యానంద గుణాలయం పరతరం వందామహే తన్మహః**

మనుః- తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధీయోయోనః ప్రచోదయాత్+జాతవేదసే+త్ర్యంబకం యజామహే' ...... ఇది మూడుమంత్రముల కలయిక 24+44+32=100 ఇందులో 100 అక్షరములుండుట చేత 'శతాక్షరీ విద్య' అంటారు. శుచిర్భూతుడై రోజూ సూర్యాభిముఖుడై 108 జపిస్తే, ఆయుర్భాగ్యంకలిగి 100 సం॥లు జీవిస్తాడు.

# త్వరిత రుద్రం

**అస్యశ్రీ త్వరితరుద్ర మహామంత్రస్య అధర్వణ ఋషిః ।**

**అనుష్టుబ్ ఛందః । రుద్రోదేవతా। అభీష్టసిద్ధ్యర్థే**

**జపేవినియోగః** అంగన్యాస కరన్యాసములు చేయవలెను.

**ధ్యాన శ్లోకం :-**

**చతుర్భుజం త్రినేత్రంచ శుద్ధస్ఫటిక సన్నిభం**
**అమృతేన చ సంపూర్ణౌ కలశౌ హస్తయోఃద్వయోః ॥**



**హస్తద్వయేన యోగస్య కృతముద్రం స్థిరాసనం**
**సర్వకామ ఫలేశానం శంకరం కరుణానిధిం ॥**
**మనుః- యోరుద్రో విశ్వాభువవా వివేశ, తస్మైరుద్రాయ నమోఅస్తు॥**

ఈ మంత్రం 1 వారంరోజులు హవిస్సు మాత్రమే భుజిస్తూ 1 లక్ష జపం చేయాలి. బ్రహ్మచర్యం - సత్యభాషణం అధఃశయ్యా నియమాలు పాటించాలి. అనంతరం తెల్లజిల్లేడు సమిధలతో, ఆజ్యంతో హోమం చేయాలి. మంత్రసిద్ధికి తర్పణం, మార్జనం, బ్రాహ్మణభోజనం చేయాలి.

ఉగ్రకర్మలకు ధ్యానశ్లోకం వేరు.

**శ్లో॥ ఉగ్రకర్మణ్యుగ్రమూర్తిం జ్వలత్పావక లోచనం**
**ద్విభుజం నాగహస్తంచ శూలపాణిం జటాధరం ॥**

# వాస్తుదోష నివృత్తి

'స నో భువనస్య ప్రజాపతే యస్యన ఉపరిగృహా యస్య వేహ । అస్మై బ్రహ్మణస్మై క్షత్రాయ మహిశ్శర్మ యచ్ఛస్వాహా ॥ ఇంద్రాయ స్వాహా ఇంద్రాయేదంన నమ అని నేతితో 8000 హోమం చేసినచో వాస్తుదోషం తొలగిపోయి గృహములో అందరూ సుఖసంతోషములు పొందెదరు.

# పరాన్నదోష శాంతి

మంత్రసిద్ధికి పరాన్నదోషము విఘ్నకారకమగును. ఈ దోష పరిహారమునకు-ఋగ్వేద మంత్రమును జలములో నిలబడి జపించవలయును.

**'తద్విష్ణోః పరమంపదం సదాపశ్యంతి సూరయః ।**
**దివీవ చక్షురాతతమ్॥**

# హృద్రోగ నివృత్తి

❖ ఈ క్రింది మంత్రముతో రోజూ3సార్లు సూర్యునకు అర్ఘ్యప్రధానము చేసినచో, గుండెజబ్బులు తొలగి ఆరోగ్యం కలుగును.

**"ఉదుత్యం జాతవేదసం దేవం వహంతికేతవః దృశే**
**విశ్వాయ సూర్యం**

# దుఃఖ నాశనం

ఈక్రింది మంత్రముచేత పూర్ణిమయందు, చంద్రోదయ సమయములో, చంద్రుని చూచుచు చేతిలో దర్భధరించి, జపించిన మనోవిచారము తొలగిపోవును. నూతన వస్త్రప్రాప్తి కలుగును.

**'త్వం సోమః పితృభిః సంవిదానో ను ద్యావాపృధీవీ**
**ఆతతంధ యత్తేమహే ప్రతి తం నో జషస్వ శన్న**
**ఏధి ద్విపదే చతుష్పదే ।**

# 6 స్థానములలో - విష్ణునివాసం

**శ్లో॥ అప్సగ్నౌ హృదయే స్యూరే స్థండిలే ప్రతిమాసుచ**
**షట్స్యేతేషు హరేః సమ్యగర్చనే యోగ్య తేచ్ఛతే ॥**
**ఆపోస్యాయతనం యస్మాత్తస్మాత్తాసు సదాహరిః**
**అగ్నౌక్రియవతాం విష్ణుంః యోగినాం హృదయే హరిః ॥**
**పండితానాం హరిః సూర్యః స్థండిలే భావితాత్మనాం**
**ప్రతిమాస్వల్ప బుద్ధీనాం షట్ ప్రకారాశ్చతా స్మృతా.**
**ఆకృత్రిమా కృత్రిమాశ్చ అచలాశ్చ తధాచలాః**
**నిర్జీవాశ్చ సజీవాశ్చ ప్రతిమాస్సంతి వైహరేః ॥**

**తా :** శ్రీమహావిష్ణువు 6చోట్ల స్థిరవాసం పొందాడు.



1. నారాయణ స్వరూపంగా నీటిలో నున్నాడు. నారములు అంటే నీరు అని అర్ధము. 2. అగ్నియందు, 3. యోగుల హృదయము లందు, 4. పండితులుచూచుసూర్యుని యందు, 5. స్థండిలమందు, అనగా హోమమునందు, 6. అల్పబుద్ధులకు విగ్రహములందు, విష్ణువు ఉన్నాడు.

ఈ విగ్రహములు కూడా తిరిగి 6 విధములు 1. సజీవములు, 2. నిర్జీవములు, 3. అకృత్రిమములు, 4.కృత్రిమములు, 5. చలములు, 6. అచలములు.

1. సజీవములు-బ్రాహ్మణులు-ఆవులు, 2. నిర్జీవములు రావిచెట్టు, 3. ఆకృత్రిమములు, ఇవి రెండు విధములు మొదటిది సాలగ్రామశిల, రెండవది ద్వారకలోని చక్రము, 4. కృత్రిమములు, ఇవి తిరిగి పదివిధములు మొట్టమొదటిది శ్రేష్ఠమైనది. క్రమేణా హీనమైనవి. 1. రత్నములతో చెక్కిన విష్ణుప్రతిమ, 2. బంగారు ప్రతిమ 3. వెండి 4. రాగి 5. ఇత్తడి 6. స్పటికం, 7. తగరం, 8. చెక్క ప్రతిమ 9. మట్టిప్రతిమ 10. చిత్రించినది.

5. చలములు, పూరీ జగన్నాధ విగ్రహం, తిరుమల వెంకటేశ్వరుడు, పండరీపురంలోని పాండురంగడు.

6. అచలములు, ఇవి క్షేత్రరూపమయినవి. 1. హరిద్వారము. 2. గయ

ఈ విధముగా భగవంతుడు ఇన్నిచోట్ల సాక్షాత్తూ ఉన్ననూ, మనము తెలుసుకొనలేక పోతున్నాము.

# వైద్యం రాణించాలంటే

❖ జ్యోతిషవేత్తకు వాక్సిద్ధీ- వైద్యునకు అమృతహస్తం ఉంటేనే ప్రజలకు ఉపకారం.

శరత్కాలంలో రుద్రజపం - ఓషధిసూక్తం జపించిన వైద్యుడు గొప్ప అమృతహస్తుడగును.

సూక్త మంత్రములు – “యా ఓషధీః సోమరాజ్ఞీః విష్ఠితాః పృధివీమను॥ బృహస్పతి ప్రసూతాస్తా అస్యై సంధ త్తవీర్యం॥ అవపతంతీ రవదిన్‌దవ క్షషధయస్పరి యం జీవమశ్నవామహై న సరిష్యతి పూరుషః యాశ్చేదముప శృణ్వంతి యాశ్చదూరం పరాగతాః సర్వాఃసంగత్య వీరుధోస్యై సంధత్తవీర్యం మావోరిషత్ఖనితా యస్మై చాహంఖనామివః ॥ ద్విపాచ్చతుష్పాదస్మాకం సర్వమస్త్వనాతురం ॥ ఓషధయః సంవదంత సోమేన సహరాజ్ఞా॥ యస్మై కృణోతి బ్రాహ్మణః తం రాజన్ పారయామసి ॥

ఇది పర్వములందు జపించినా–లేదా రోజూజపించిన 6నెలలలో వైద్యులకు రాణింపు–రోగులకు ఆరోగ్యసిద్ధి కలుగును.

# రుద్రాధ్యాయం

❖ మంత్రప్రయోగ సహితముగా రుద్రాధ్యాయం చెప్పబడు చున్నది సంస్కారములేనివారికి, తాంత్రికులకు ఇది ఇవ్వరాదు.

ఓం సమస్తే రుద్రమన్యవ ............ గిరిశాచ్ఛావదామసి ॥ గోఘృతముతో ఈమంత్రము లక్షసార్లు హోమము చేయవలయును.

అనంతరం–ద్రాక్ష, తేనె, తిలలు పెరుగు వీటితో రోజూ వెయ్యిసార్లు 11 రోజులు హోమంచేసిన కార్యసిద్ధి యగును. బాలవ్యాధులు–బాలగ్రహదోషములు తొలగిపోవును. 15రోజులు హోమంచేసిన రాష్ట్ర ఉపద్రవములు నశించును. 20 రోజులు హోమం చేసినచో దేశోపద్రవములు తొలగిపోవును. 1 నెల హోమం చేసినచో ప్రపంచశాంతి కలుగును.

**“యథానః సర్వమిజ్జగదయక్ష్మగ్‌ం–సుమనాఅసత్ ॥**

ఈమంత్రము 10వేలు జపిస్తే శాపమోక్షణం సంభవిస్తుంది. శిశిర ఋతువునందు ప్రాతఃకాలము జలమందుండి 1 లక్ష జపించినచో సుఖప్రాప్తి.

“అధ్యవోచదధివక్తా ప్రథమోదైవ్యోభిషక్ అహీగ్‌శ్చ సర్వాన్ జంభయన్ సర్వాంశ్చ యాతుధాన్యోధరాచీ పరాసువ, లక్ష జపం. నెయ్యి, ఆవాలు



హోమం, వ్యాధినాశనం ఫలితం. 7 సార్లు ఆవాలు మంత్రించి ప్రయాణమై వెళ్ళునపుడు దశదిశలా చల్లితే – మార్గక్షేమం. 7 సార్లు మంత్రించిన ఆవాలు, దెయ్యములు – భూతములు పట్టిన వారిమీద జల్లితే స్వస్థత చేకూరుతుంది.

ఈ మంత్రంతో మంత్రించిన జలంసేవిస్తే రోగనాశనం, వెయ్యిసార్లు మంత్రించి పుట్టలోవేస్తే సర్పనాశనం.

అసౌయస్తామ్రో ...........సదృష్టో మృడయాతి నః, ప్రాతః సాయంసమయాలలో రోజూ 3 సం॥లు 108సార్లు సూర్యుని ఉపాసిస్తే, అక్షయసంపదలు కలుగుతాయి. 100 సార్లు జపించి పాలతో శివాభిషేకం 1సం॥ చేస్తే వశీకరణసిద్ధి 1000 తెల్లజిల్లేడు సమిధలతో హోమంచేస్తే వర్షం పడుతుంది.

నమోఅస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే అథోయే అస్య సత్వానో హం తేభ్యోవాకరంనమః స్థండిలంలో బహుళాష్టమి నుండి బహుళ చతుర్దశివరకు 1000 ఘృతం పాయసం హోమంచేస్తే సర్వకార్యసిద్ధి.

ప్రముంచ ధన్వన॥ ....... అథాయ ఇషుధిస్తవారే అస్మిన్ని ధేహితమ్ ॥ 6 వేలు జపించి, 10 వేలు దర్భకంటకములు హోమం చేస్తె విద్వేషణసిద్ధి. బెల్లంతో శతృనామోచ్చారణతో హోమంచేస్తే ఉచ్చాటన. పలాశ – అశ్వత్థ–బిల్వ– అపామార్గములు విప్రాది 4 జాతులు క్రమముగా–దధి, తేనె ఘృతములతో హోమం చేస్తే వశ్యం–సర్వకార్యసిద్ధి (శివునకు గగ్గులుధూపం చాలా ఇష్టం)

నమస్తేఅస్తు భగవన్ విశ్వేశ్వరాయ ............ శ్రీమన్మహా దేవాయనమః ఈ మంత్రం 10 వేలు జపించి, బిల్వపత్రములు నేతితో తడిపి, శివసహస్రం చదువుతూ ఒక్కొక్క పత్రం అర్చిస్తే ధనవృద్ధి.

నమో హిరణ్యబాహవే .................. వనానాం పతయే నమః॥ వెయ్యి జపం, జయం కలుగుతుంది.

నమో రోహితాయ ...................... నమో విషంగిణ ఇషుధిమతే తస్కరణాం పతయే నమో నమః 5వేలు జపం వ్యాఘ్ర– చోరభయం ఉండదు.

నమో వంచతే ....................... నమ ఆయచ్చ ద్భ్యో విసృజద్భ్యశ్చవో నమోనమః 8 వేలు జపం, వ్రణబాధ తొలగిస్తుంది. కేన్సర్ నివారిస్తుంది.

నమ అస్వద్భ్యో ..................... అశ్వపతిభ్యశ్చవోనమః 9 వేలు జపం, చతురంగ బలములకు శాంతి కలుగుతుంది.

నమ అవ్యాధినీభ్యో ...................... శ్వభ్యఃశ్వపతి భ్యశ్చవో నమః 16 వేలు పురశ్చరణ–దుష్టగ్రహబలి ఇచ్చినట్లయితే రోగనాశనం, ఆరోగ్యసిద్ధి కలుగుతాయి.

నమోభవాయచ ......................... నమో వృద్ధాయచ సంవృధ్వనేచ 10వేలు పురశ్చరణ–సంపదలు కలుగుతాయి. మూడు సంధ్యలయందూ రోజూ 1సం॥ పఠిస్తే భాగ్యవృద్ధి.

నమ అగ్రియాయ .................. శ్రుతసేనాయచ 5వేలు పురశ్చరణ కుంటితనంపోయి ఆరోగ్యం కలుగుతుంది.

నమో దుందుభ్యాయ .................. వైశంతాయచ 20 వేలు పురశ్చరణ, జయం కలుగజేస్తుంది. కోర్టు వ్యవహారములందు అనుకూలత కలుగుతుంది.

నమః కూప్యాయ ......................... వాస్తు పాయచ॥ 6 వేలు పురశ్చరణ, సూర్యగ్రహణ సమయంలో చేయాలి.

నమః సోమాయ ......................... శివతరాయచ 10 వేలు పురశ్చరణ, రోజూ 3సార్లు 108 జపించి, భస్మ జలం సేవిస్తె క్షయరోగ నివారణ, ఇలా 3 నెలలు చేయాలి. క్షుద్రరోగములు 3 రోజులలో తగ్గుతాయి.



నమః తీర్థ్యాయచ ....................... ప్రవాహ్యాయచ 6 వేలు పురశ్చరణ, 6 నెలలు తీర్థములందు జపం. తీర్థములందు చెప్పబడిన శుభఫలితములు కలుగుతాయి.

నమ ఇరిణ్యాయచ ...................... చోలప్యాయచ 9 వేలు పురశ్చరణ ధాతువాదం–పదవీయోగం సిద్ధిస్తాయి.

నమ ఊర్వ్యాయచ ................... ప్రఖిదతేచ ॥ 8 వేలు పురశ్చరణ–మంత్రించిన జలయంయిస్తే దుఃఖనివారణ.

నమో వఃకిరికేభ్యో .................... ఆమీవత్కేభ్యః 1 లక్ష పురశ్చరణ, తిలహోమం, 1 సం॥లో పదవీయోగం. బిల్వ సమిధహోమం 8 వేలుచేస్తే స్వర్ణప్రాప్తి. బిల్వంలేనపుడు ఉసిరి–లేదా మేడి–హైమవతి (...........) జీడిసమిధలు ఉపయోగించవచ్చు.

యాతేరుద్ర ....................... జీవసే 11 పోగులు సూత్రమును 11 ముళ్ళువేసి మంత్రించి, తాడును పూజించి ధూపమువేసి, గర్భిణిస్త్రీకి ఎడమచేయికి కడితే, సుఖముగా ప్రసవిస్తుంది. శిశివునకు కుడిచేతికి కడితే బాలుడు ఆరోగ్యముగా ఉంటాడు.

ఇమాగ్ం రుద్రాయ ................ గ్రామేఅస్మిన్న నాతురం। 108 జపించి, తిలహోమంచేస్తే, అయాచితంగా ధనం లభిస్తుంది. దూర్వా–పగడములు, నేతితో హోమంచేస్తే, అనారోగ్యం తొలగిపోతుంది. అపమృత్యు భయం ఉండదు.

మృడానోరుద్రో .................... రుద్రప్రణీతౌ॥ జలమందుండి వెయ్యి జపించి, తీరమందు శివుని అర్చించాలి. కోరినవారు 3 రోజులలో తనదగ్గరకు వస్తారు.

మనోమహాంత....................రుద్రరీరిషః। పరిజనులకు, బాలురకు ఆరోగ్యసిద్ధికి తిలహోమం చెయ్యాలి. 10వేలు జపిస్తే అంటువ్యాధులు వైరస్ వ్యాధులు రావు.

మానస్తోకే ............................విధేమతే। అతికృచ్ఛ్రం లేదా కృచ్ఛ్రం-చాంద్రాయణం ఆచరించి శరీరము-మనస్సు శుద్ధి చేసుకొని-శాకములుగాని, జావగాని తీసుకుంటూ 10వేలు జపించాలి. ప్రయోగములకు 1 వెయ్యి జపిస్తేచాలు. ప్రయోగాంతము నందు అహోరాత్రజపం చేయాలి. మేడిసమిధలు, నేతితో హోమం చేయాలి. అనంతరం మహావ్యాహృతులతో ఆజ్యం హోమం వెయ్యి చెయ్యాలి. సర్వకామార్ధసిద్ధికి ఉత్తరేణి సమిధలు-బియ్యం 10వేలు హోమం చేయాలి. 108 హోమంచేసి 8వేలు మంత్రించి, "చరుద్రవ్యం" భార్యతో కలసి భుజించినట్లయితే ఆయుష్మంతులగు 8మంది పుత్రులు కలుగుదురు. 3 రాత్రులు ఉపవాసంఉండి, 4 మార్గముల కూడలియందు గోమయంతో శివలింగముచేసి ఆసన్నిధి యందు, భూమిపై 108 హోమంచేస్తే రాజవశీకరణసిద్ధి, బిల్వసమిధలు-పెరుగు-నెయ్యి, తేనెతో 1లక్ష హోమం చేస్తే బ్రహ్మవర్చస్సు కలుగుతుంది.

ఆరాత్తే గోఘ్న ...................ఆచరపినాకం బిభ్రదాగహి మహాభయము కలిగినపుడు ఈ 4ఋక్కులు పఠించినధైర్యము కలుగును.

వికిరిదవిలోహిత ................ నివపంతుతా॥ 10 వేలు జపిస్తే అధికారులు అనుకూలురగుదురు.

సహస్రాణీ .................. ముఖాకృధి॥ పుల్లచెముడు సమిధలతో హోమంచేస్తే ఉపద్రవ నాశనం.

సహస్రాణి సహస్రశో .................. సహస్రయోజనేవ ధన్మాని తన్మసి, ఈ 9 ఋక్కులు పఠిస్తే భోగమును కలిగిస్తాయి.

నవోస్తు రుద్రేభ్యో ...................... జంభేదధామి॥ మధ్యాహ్నమందు ఆజ్యహోమం కంటకములతో హోమం చేస్తే ప్రత్యంగిరావలె పనిచేయును.



# గణపతి సూక్తం

(ఋగ్వేదం-10మండలం-112-8; 8మం-81)

✤ నిషుసీద గణపతే గణేషుత్వా మాహుర్విప్రతమం కవీనాం నృతేత్వత్క్రియతే కించనారే మహామర్కం, మఘం చిత్రమర్క॥ త్వేషంగణం తవశంఖాది హస్తం ధృతిప్రతం మావిదానంతి వారం॥ మాయభువోయే॥ ఆతూన ఇంద్ర క్షుమంతం చిత్రంయామం సంగృభాయ॥ మహాహస్తి దక్షిణేన విద్యాహిత్వా తు వికూర్మింతు విదేశంతువీ మఘంతువిమాత్రమవోభీః నహిత్వా శూరదేవా న మర్తాపోదిత్సతం॥ భియంగోవాదయంతే॥ ఏతోన్వింద్రం స్తవామే శానం వస్వస్వరాజ్యం॥ నరాధషార్ధిషంనః ప్రస్తోష ఉపగాషిషచ్ఛవ త్సామ గీయమానం అభిశర్ధశ్య జుగురత్ । ఆనోముఖ్యంజనం దక్షిణేనభీమమధ్యన ప్రామృజద్వా ఇంద్రమానోవసోర్నిర్యాక్ ॥ ఉపక్రమస్యాభర ఘృతాద్విష్ణో జనానాం యద్యశుష్ఠరస్యవేద॥ ఇంద్రయ ఉనుతే అస్తిఓజో విప్రేభిస్తనిత్వ॥ అస్యాభిస్తుతం సన్నిహి సయాజుప్తో వజాఅస్మభ్యం విశ్వశ్చంద్రాః॥ బలేశ్చమక్షు జరంతం ॥

ఇవి 12 ఋక్కులు, వీటితో షోడశోపచార పూజచేసి, మోదకములు నివేదనచేసినచో సర్వసిద్ధులు కల్గుతాయి ఈ సూక్తము 21వేలు జపించిన పురశ్చరణవంతుడగును.

# దేవీ సూక్తం

**శ్లో॥ దేవీసూక్తం ప్రవక్ష్యామి సర్వాభీష్టప్రదాయకం ।**
**అశక్తః ప్రోచ్యతే రుద్రే రుద్రే వినాయంతత్పురః పఠేత్ ॥**

**తా :** సర్వాభీష్టములను తీర్చు "దేవీసూక్త" మును చెప్పుచున్నాను. "రుద్రం" చెప్పుటకు అశక్తుడయినవాడు, ఈ సూక్తపఠనమువలన అభీష్టసిద్ధుడగును. ఇది మంత్రసిద్ధికి ఆధారము.

"అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహ మాదిత్యైరుత విశ్వదేవైః అహం మిత్రావరుణొభా బిభామ్యహమింద్రాగ్ని అహమశ్వినోభా అహంసోమ మాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణంభగం అహందధామిద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే ॥ అహంరాష్ట్రీ సంగమినీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానాం తంమాదేవాః వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయంతీం॥ మయాసో అన్నమత్తి యోపవిశ్యతి యఃప్రీణితి య ఈంశృణోత్యుక్తం అమంతవోమాంత ఉపక్షియంతి శృధి శృతశ్రద్ధివంతే వదామి॥ అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః యంకామయేతం తముగ్రంకృణోమితం బ్రహ్మాణాం తంబుషింః తంసుమేధాం అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ అహం జనాయ సమదం కృణోమి అహంద్యావా పృథివీ అవివేశ॥ అహంసువే పితరమస్య మూర్ధన్ మమ యోనిరప్స్వంతః సముద్రేతతోవితిష్ఠే భువనాను విశ్వోతామూద్యాంవర్ష్మణో పశ్పృశామి అహమేవ వాతిఇవ ప్రవామ్యార భమణా భువనాని విశ్వా పరోదివాపరఏనా పృధివ్యైతావతీ మహినా సంభభూవ ॥

"దేవీసూక్తమిదం ప్రోక్తం
సర్వసూక్తో త్తమోత్తమం ॥

# మహాగణపతి మంత్రములు

మహాగణపతి అంశతో 64 గణపతులున్నారు కాశీ నగరము బయట 8మంది గణపతులున్నారు. శీఘ్రసిద్ధినిచ్చు క్షిప్రగణపతి మంత్రం. 1. గం విఘ్నాయ నమః 40వేలు జపసిద్ధి. ఘృతపాయస హోమం. ఈ గణపతికి యోగిని "ప్రియాదేవి"

**మంత్రం - ఓం శివే శివపత్ని శంశివే స్వకరేపంకజం ఫలం. దేహి మనోజపం చరణయోర్దేహిదేహి తుభ్యం నమః ॥**



**ధ్యానం- ఉద్యద్భాను సహస్రాభాం కమలాసన పూజితాం**
**హస్తే మోహమయం పాశం తథానాం ప్రభజే శివామ్ ॥**

30వేలు జపం. కుంకుమపువ్వు హోమం, తర్పణం.

2. కాశీకి ఈశాన్యదిశలో ఖర్వగణపతి 3. కూష్మాండగణపతి 4. కూటదంత గణపతి 5. ముండ వినాయకుడు. 6. వాగ్వాద గణపతి 7. రాజపుత్ర గణపతి, 8. ఏకదంత గణపతి, వీరి యోగినులు, వారిమంత్రన్యాస అనుష్ఠాన విధానములు వివరములు విస్తృతముగా నున్నవి.

# త్రిముఖ గణపతి

త్రిముఖ గణపతికి 3 ముఖములుంటాయి. ఇవి 1. కపి 2. సింహం, 3. గజముఖములు, ఈ గణపతికి యోగినిపేరు "శుకా".

మంత్రం, ఓం పంకజాక్ష్య మృతఫలం దేహి దేహి

శ్రీం స్వాహా ॥ 60వేలు జపసిద్ధి పలాశ పుష్పాలు హోమం.

గణపతియొక్క ఏకబీజమంత్రం అన్ని ఆమ్నాయాల వారికి వివిధరూపముగా ఇట్లున్నది. వైదికమార్గ ఉపాసకులకు 'గ'కారము. దక్షిణాచారులకు 'గం' పూర్వామ్నాయులకు 'గః' పశ్చిమామ్నాయులకు 'గః' ఊర్ధ్వామ్నాయులకు 'గ్లౌం' ఉత్తరామ్నాయులకు 'గౌం' బీజము అగుచున్నది ఋషిర్గణపః, నివృతిచ్ఛందః విఘ్న రాజో దేవతా.

**శ్లో॥ రక్తాంబరం రక్తవర్ణం రక్తగంధానులేపనం**
**రక్తపుష్పైః పూజ్యమానం తుందిలం చంద్రమౌళినం**
**త్రినేత్రం వామనం విఘ్నాధీశం పూజ్యంచ శుండినం**
**వామేదక్షేద్వయోః పాశాంకుశౌపాణ్యోస్తుబిభ్రతం**
**పద్మాసనం సర్వభూషం ధ్యాయేద్విఘ్న వినాయకమ్ ॥**

1 లక్ష జపం అష్టద్రవ్యహోమం త్రిమధురం, ధనార్ధి చవితినాడు కొబ్బరితో 4వందలు హోమం చేయాలి. తిలలు+నేయి హోమం చేస్తే ధనం-కీర్తి కలుగుతాయి.

# లక్ష్మీ గణపతి

ఇది దక్షిణామ్నాయములోనిది. మంత్రం-శ్రీం గం సౌమ్యాయ మహాగణపతయే వరవరద సర్వజనంమే వశమానయస్వాహా। అంతర్యామి ఋషిః- గాయత్రీతివృత్ ఛందః- లక్ష్మీగణపతిర్దేవతా, అఖిలాప్తయే వినియోగః ॥

1లక్ష జపం, బిల్వసమిధ హోమం, ఇదేమంత్రంలో ముందు ప్రణవంచేర్చి, రమాబీజం తొలగించి, గుండెలోతు నీళ్ళలో నిలబడి, సూర్యమండలం ధ్యానిస్తూ 3 లక్షలు జపించినచో ధనవృద్ధి కలుగును. లేదా మారేడు చెట్టుక్రింద కూర్చొని 3 లక్షలు జపించిననూ ధనవృద్ధి జరుగును. జిల్లేడు సమిధలచే హోమం చేసిన విశ్వమంతా వశ్యమగును.

# శక్తిగణపతి మంత్రం

హ్రాం హ్రుంహ్రీం భార్గవరుషిః విరాట్‌ఛందః శక్తిగణపతి ర్దేవతా 1 గాంగీం గూం గేం గైం గౌః షడంగ న్యాసములు. 1 లక్ష జపం అష్టద్రవ్యములు 3వేలు హోమం విద్యాసిద్ధి. తేనె హోమంచేత వశ్యం సంతానములేని స్త్రీ రుతుస్నాం అయినరోజున వినాయకుని పూజించిగోమూత్రమందు కొంచెం పసుపు, వస, కుష్ఠం బాగామర్దించి, దానిని వెయ్యిసార్లు మంత్రించి సేవించినచో సుపుత్రుని పొందును. గురువును ఆరోజు భోజన-దక్షిణ తాంబూలములతో పూజించవలెను. ఇదేమంత్రమునకు ముందు ప్రణవము చేర్చినచో, మరొక శక్తిగణపతి మంత్రమగును. చందస్సు గాయత్రి అగును. న్యాసములు పూర్వములాగే చేయవలెను.



శ్లో॥ బృహజ్జాను స్తుందిలశ్చ లంబబాహుర్విలోచనః
దక్షోర్ధ్వ హస్తపాశంచాథోవామే చాక్షసూత్రకం
దక్షిణాథో నిజోదంతమూర్ధ్వే బాహౌతథాస్పృణీం
పుష్కరేణతుబిభ్రాణం మోదకం హేమభూషణం
శక్తియుక్తం విశ్వవంద్యం గణేశంచింతయామ్యహమ్
3 లక్షలు జపసిద్ధి. ఆజ్య+తిలలుహోమం

# క్షిప్రప్రసాద మంత్రం

ఓం గం క్షిప్రప్రసాద నాయహ్రీం గణక రుషిః ।
విరాట్ ఛందః క్షిప్రప్రసాద వినాయకో దేవతా ॥

శ్లో॥ సర్వత్రాయుధానం వామోర్ధ్వా ప్రదక్షిణం
పాశాంకుశే విలసతాం పత్రాగ్రంచ దధత్కరైః ।
బీజాపూరం పుష్క రేచ త్రినేత్రో రక్తవస్త్రవాన్
భక్తం సదాపూర్ణ చంద్ర మౌళిరవ్యాత్ గణేశ్వర ॥

1 లక్ష జపం త్రిమధురం తిలలు హోమం కేవలం నెయ్యహోమం వల్ల సంపదలు కలుగుతాయి. 40 రోజులు కొబ్బరితో హోమంచేస్తే సర్వసంపత్ సమృద్ధి. రోజూ జలతర్పణం చేస్తే వాంఛితార్థ సిద్ధి కలుగుతాయి.

# హేరంబ గణపతి మంత్రం

ఓం తాంనమః గణకరుషిః గాయత్రీ ఛందః పంచ వక్త్రో సింహవాహనో హేరంబ గణపతిర్దేవతా। ధ్యానం

శ్లో॥ ముక్తా విద్యున్మేఘ దుగ్ధకాశ్మీరీ సన్నిభైర్ముఖై ః
గజవత్పంచభీర్యుక్తః కిరీటీ చాసిహస్తికః
అంకుశం చత్రిశూలం చ ముద్గరంచ కపాలకం
స్వయంత మభయం చాపి వరం మోదకమేవచ ।

**పశుంచా క్షమాలాంచ దధతం కరపంకజైః**
**కోటిసూర్య ప్రతీకాశంధ్యాయేత్ హేరంబమవ్యయమ్**

3లక్షలు జపం. తిలహోమం. క్షిప్రగణపతివలె ప్రయోజనం.

# హరిద్ర గణపతి మంత్రం

**ఓం హుం గం గ్లౌం హరిద్రాగణపతయే వరవరద సర్వజన హృదయం స్తంభయ స్వాహా। మదనరుషిః అనుష్టుప్ఛందః హరిద్రాగణపతిర్దేవతా ॥**

శుక్లపక్ష చవితిరోజున శుభ్రమైన పసుపుకొమ్ము కన్యచేత నూరించి, దానిని శరీరమునకు పూసుకొని, స్నానం చేసి భక్తితో గురువుకు నమస్కరించి, దక్షిణతో సంతృప్తి పరచి మంత్రోపదేశము పొందాలి.

శ్లో॥ **పీతాంబరం పీతవర్ణం పీతగంధానులేపనం**
**పీతపుష్పైః పూజ్యమానం మణిసింహాసనస్థితం**
**పీతభూషం త్రినేత్రంచ షడ్భుజంచవరాభయం**
**క్రోధముద్రాం సృణింపాశం పరశుంబిభ్రతం కరైః**
**ధ్యాయేత్ శుద్ధమనా మంత్రీ హరిద్రాగణపం**
**ప్రభుమ్ ॥**

4 లక్షలు జపం. పసుపుకలిపిన తండులములు హోమం కన్యక బ్రహ్మచారులకు భోజనం పెట్టాలి. పేలాలు హోమం చేస్తే శీఘ్ర వివాహసిద్ధి.

# కామదేవ మూలమంత్రం

హ్రీం కామదేవాయ సర్వజనప్రియాయ సర్వజన సమ్మోహనాయ జలద్వహ్నిమయ ప్రజ్వల సర్వజనస్య హృదయం మమవశం కురుకురు స్వాహా ॥ 10వేలు జపం. శుక్లపక్ష త్రయోదశి సోమవారం వెయ్యిజపించి తాంబూల సేవనం చేస్తే వశీకరణం.



# త్రైలోక్య మహాగణపతి

మంత్రం-వక్రతుండైక దంష్ట్రాయ క్లీం హ్రీం శ్రీం గం గణపతయే వరవరద సర్వజనంమే వశమానయస్వాహా ॥ గణపతి ఋషిః గాయత్రీ ఛందః త్రైలోక్యమోహన గణపతి ర్దేవతా అఖిలాప్తయే వినియోగః మహాగణపతివలెశేషం॥

# వక్రతుండ గణపతి

మంత్రం-మేఘోల్కాయ స్వాహా। భార్గవ ఋషిః అనుష్టుప్ ఛందః వక్రతుండ గణేశో దేవతా అఖిలాప్తయే వినియోగః

మరొక మంత్రం - రాయస్పోషస్యదయితా నిధిదోరత్నదోమతః రక్షోహనో బలగహనో వక్రతుండాయ హుం 12వేలు జపం.

# రాజమాతంగి

మంత్రం-ఓం హ్రీం నమః పద్మేశ్రీం రాజితే రాజపూజితే జయే విజయే గౌరీ గాంధారి త్రిభువన శంకరి-సర్వస్త్రీ పురుషవశం కరి-సుఖదాఘే ఘేంఘేం స్వాహా ॥

బ్రహ్మరుషిః నివృత్ గాయత్రీ ఛందః రాజమాతంగీ దేవతా॥ 10వేలు జపం పాయసఘృత హోమం.

# వశ్యమాతంగి

మంత్రం-ఓం రాజముఖి రాజాభిముఖీ వశ్యముఖీ హ్రీం శ్రీం క్లీం దేవదేవి మహాదేవి దేవాధిదేవి-సర్వజన ముఖం మమవశ్యం కురుకురుస్వాహా ॥

# చండమాతంగి

మంత్రం-హ్రీం నమో హిలిహిలి చండమాతంగినీ స్వాహా ॥ పైరెండు మంత్రములు 10వేలు జపం, ఘృతపాయస హోమం.

# కర్ణమాతంగి

మంత్రం-ఐం హ్రీం శ్రీమాతంగి అమోఘే సత్యవాదిని మమకర్ణె అవతర అవతర సత్యంకథయ కధయ ఏహ్యేహి శ్రీమాతంగ్యై నమః ॥

1 లక్ష జపం-ఘృతం-పాయసహోమం, ప్రశ్న అడగవచ్చిన వారి వివరములన్నియు "మాతంగి" చెవిలో చెప్పును.

# ఉచ్ఛిష్ట చాండాలి

మంత్రం-నమ ఉచ్ఛిష్ట చాండాలి మాతంగీ సర్వ వశంకరీ స్వాహా॥ నారద తుంబురౌ ఋషీ నివృత్‌గాయత్రీ ఛందః ఉచ్ఛిష్టచాండాలి మాతంగీ దేవతా 1 లక్ష జపం, పలాశపుష్ప హోమం. మంత్రసిద్ధి కానిచో అక్షరలక్షలు జపించాలి. భుక్తశేషం రాత్రియందు బలిగా ఇవ్వాలి. ఇది జగన్మోహకర మంత్రం.

# ఉచ్ఛిష్ట గణపతి

మంత్ర-హస్తిపిశాచి లిఃలిః స్వాహా ॥ కంకోలరుషి విరాట్ చందః ఉచ్ఛిష్టగణేశో దేవతా॥ 9 లక్షలు జపం.

అంగుష్ట ప్రమాణంతో, వేపకర్రతో గణపతి విగ్రహం చేయించి, దానిని స్పృశించి బహుళషష్ఠి చతుర్దశిరోజు అర్ధరాత్రి జపం చేయాలి. అభీష్టం సిద్ధిస్తుంది. సంపదలు కలుగుతాయి. మరొక మంత్రం - హస్తిపిశాచి లిఖే స్వాహా ॥



# వామమార్గ శ్రేష్ఠత

ఉపాసన 2 విధములు. 1. సకామము, కోరికలతో కూడినది. 2. నిష్కామం, ఏకోరికలూ కోరనిది. వీటిలో దక్షిణమార్గం సకాములకు శ్రేష్టమైనది. వామాచారము శ్రేష్ఠతరమైనది. రెండు విధానములూ తెలిసినవాడే పరమగురువు. ఈ రెండు మార్గములు పూర్తిగా నాకు తెలుసు. 3 భాగములు సనక సనందనాది రుషులకు తెలుసు. 2 భాగంలు వశిష్ఠుడు. 1 భాగం ఇంద్రాదులకు తెలుసు నవనాధులకు (మత్స్యేంద్రనాధుడు. గోరఖ్‌నాధుడు మొ॥) అరవై వంతు తెలుసు. **కోట్యంశమితరే జనాః** ఇతరులకు కోటివంతు తెలుసు వామమార్గమందుకూడా సాత్విక, రాజస, తామస, విధానము లున్నవి. శ్రీకృష్ణుడు వామమార్గమును ఆచరించి, అర్జునకు ఉపదేశించాడు. ఇది శుకయోగికి తెలుసు. వామమార్గమందు 3 తంత్రములను ముగ్గురకు ఇచ్చాను. ఒకటి దత్తాత్రేయునకు, రెండు శ్రీకృష్ణునికి, మూడు దేవికి ఇచ్చాను. దత్తాత్రేయుని వలన 2 యుగములందు వృష్ణీకాదులు అనేకమంది వామమార్గమున ముక్తులయ్యారు. సర్వతంత్రసారము "కుండలినీ శక్తి" అని తెలియవలెను.

వ్యామోహకారకమైన మద్యము నరకప్రదమైనది. వైదిక మార్గ మందుండు బ్రాహ్మణులు మద్యమును స్పృశించరాదు. వామాచారులయిన బ్రాహ్మణులు వైదికకర్మలు చేయరాదు. తులసి తాకరాదు. కౌళుల నాశ్రయించి నిత్యమూ శక్తిఆరాధన చేయుచుండ వలయును. వామ మార్గీయులు పూజాలోపం చేయరాదు. గంగాస్నానం-సాలగ్రామార్చన పనికిరాదు. తీర్థయాత్ర చేయరాదు. గురూపదిష్ట విధానముద్వారానే ఆచరించాలి.

# సూర్యమంత్రములు

**ఓం ఘృణిసూర్య ఆదిత్యః ।**
**దేవభాగ ఋషిః గాయత్రీఛందః రవిదేవతా**
**మంత్రం–తేజో జ్వాలామణే హుం ఫట్‌స్వాహా ॥**

3 లక్షలు జపసిద్ధి ఆదివారం విశేషార్చన చేయాలి. మంత్రసిద్ధి వలన ఆరోగ్యం కలుగును.

(సత్య) తేజో జ్వాలామణే హుం ఫట్ స్వాహా–హృదయ న్యాసం బ్రహ్మ–విష్ణు–రుద్ర–అగ్ని–సర్వ–తేజోజ్వాలామణి.................... ఇతరన్యాసములు చేయాలి.

# గ్రహ మాతృసాధన

నవగ్రహముల మాతృ దేవతలను పూజించి, వారిని సంతోషపరచినచో, గ్రహములు దుష్టస్థానములందున్ననూ, బాధించలేవు. గ్రహమాతృదేవతల అనుగ్రహము లేనిదే గ్రహములు శుభఫలితములు కూడా పూర్తిగా ఇవ్వలేవు.

సూర్యగ్రహమునకు తల్లి' పింగళాయోగినీ – మహావ్యాధికారిణి. ఈమెను పూజించి సంతోషపరచిన శతృనాశము చేయును.

మనుః–క్షేం పింగళేవైరివారిణి ప్రసీదఫట్–క్షాం క్షీం–క్షూం– క్షైం–క్షః షడంగ న్యాసం

ధ్యానం–పింగవర్ణాం పింగకేశీం పింగనేత్రాం ధనుఃశరాన్

హస్తాభ్యాం దధతీం పద్మయుగళం తాంభజామ్యహమ్

పూజావిధి–మోదుగుపూలతో పూజ–గగ్గులుధూపం నేతిదీపం–మధురపదార్థ నైవేద్యం పాయసాదులు. ఎర్రచందనం. ఎర్రని ఆభరణములు.



1000 జపం 1 వారం రోజులు చేయాలి. అనంతరం చతురస్ర కుండమందుగాని, స్థండిలమందుగాని, బిల్వపత్రములు, బిల్వఫలములు, కమలములు, నాగకేశరములు, పాయసములతో హోమం చేయాలి. వెయ్యి, లేదా పదివేలు, లేదా లక్షహోమం చేయాలి.

# చంద్ర మాతృసాధన

మనుః–హ్రీం మంగళే మంగళాలయే స్వాహా హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం హ్రూం, హ్రః షడంగన్యాసం.

**ధ్యాన శ్లోకం :-**

**"ధ్యాయేదేనాంత్రి నయనాముద్యదాదిత్య సన్నిభం**
**దరస్మేర ముఖాంభోజాం సింధూర సుందరాధరం ।**
**పద్మద్వయే ధనుర్బాణాన్ దధతీం భుజపల్లవైః**
**సుగుంజన్మంజు మంజీరాం కాంచీగుణ విరాజితమ్ ॥**

1. లక్షజపం, యోగినీ–క్షేత్రపాలక, బటుక, గణాధిపతులకు బలి సమర్పించాలి.

# కుజ మాతృసాధన

మనుః– క్లీం భ్రామరి ప్రసన్నాత్మనే అధీశ్వరిభ్రామయ క్లీం.

పంచదారను ఈమంత్రముతో 11సార్లు అభిమంత్రించి తాను ఇంటినుంచి వెళ్ళేమార్గమునందు దశదిశలా చల్లాలి. ప్రాతఃకాలం ఆమార్గమందు విడిచివెళితే అందరూ మోహితులవుతారు వెడుతూ 1యోజనం వరకూ మంత్రజపం చేయాలి.

# బుధ మాతృసాధన

మను–బ్లం భద్రికే మేమమభద్రం దేహి పరభద్రాణి నాశయ స్వాహా ।

బ్లాం, బ్లీం, బ్లూం, బ్లైం, బ్లం, షడంగన్యాసం.

పింగళామృత యోగినివలె, జపము చేయవలెను. మార్గమందు కూడా చేయవచ్చు.

# గురు మాతృసాధన

మనుః– శ్రీం ధనదేధాన్యేస్వాహా ।

శ్రాం, శ్రీం, శ్రూం, శ్రైం, శ్రౌం, శ్రః షడంగన్యాసం॥ ధ్యానయోగిని వంటి ధనప్రదయోగిని మరొకరు లేరు 3 పురశ్చరణలు చేసినచో పూర్వజన్మ పాపము నశించును. కాశీయందున్న ధ్యానయోగిని దర్శనం చేయాలి.

# శుక్ర మాతృసాధన

మనుః– హ్రీం సిద్ధిదే సర్వం మమ సాధయ సాధయ నమః హ్రాం, హ్రీం, హ్రూం, హ్రైం హ్రౌం హ్రః షడంగన్యాసం॥ జపాదులవలన సిద్ధించును.

# శని మాతృసాధన

మనుః– ఐం హ్రీం ఉల్కాదేవ్యై నమః ఐం+హ్రీం రెండు బీజములతో షడంగన్యాసం, ఇది ధనారోగ్యప్రదం జపమువల్ల సిద్ధి.

# రాహు మాతృసాధన

మనుః– హ్రీం సంకటే రోగం మేపరమం నాశయ నాశయ ॥

1 లక్ష జపంవల్ల బంధమోక్షం. సర్వ దుఃఖములను పోగొడుతుంది 16 లక్షల జపంవల్ల దూర్వా హోమంవల్ల మంత్రసిద్ధి.



# కేతు మాతృసాధన

**మను॥ ఓం నమో భగవతి వికటే వీరపాలికే ప్రసీద**

కాశియందు వీరేశ్వరాసన్నమైన వికటయోగిని పశ్చిమదిశ యందున్నది. అచ్చట ఈ మంత్రజపంవల్ల శీఘ్రసిద్ధి వంధ్యాస్త్రీలు, తల్లిదండ్రులు వదిలివేసిన బాలురు వీరు సాధకుని కరస్పర్శవల్ల ఆరోగ్యమును పొందెదరు. సంధ్యా స్త్రీలకు ఉదరస్పర్శ చేయవలెను.

# సప్త సరస్వతులు

**1. చింతామణి సరస్వతి మంత్రం :-**

**ఓం హ్రీం హ్రైం హ్రీం ఓం సరస్వత్యై నమః ॥**

**కంఠముని :-** త్రిష్టుప్ ఛందః– చింతామణి సరస్వతీ దేవతా

**ధ్యానం :- హంసారూఢాం మౌక్తికాభాం**
**మందహాసేందు శేఖరాం ।**
**వీణామృతఘటాక్షస్ర గ్దీప్తహస్తాంబు జస్థితామ్ ॥**

రోజూ 3 వేలు – 3 నెలలు జపిస్తే "మహాకవి" అవుతాడు.

2. జ్ఞానసరస్వతి – మంత్రం.

ఐం హ్స్ర్యాం హసక్షలరీ ః

దక్షిణామూర్తి ఋషిః

ధ్యానం – నవకుందనిభాం దేవీంముక్తాజాలాశ్చ శూషితాం ॥

ముద్రాకపాల రుద్రాక్షమాలారాజన్మహా భుజామ్ ॥

1. లక్ష జపంచేస్తే సిద్ధి – విద్యాభివృద్ధి.

3. నీలసరస్వతీ మంత్రం –

ఓం శ్రీం హ్రీం స్త్రాం హుంఫట్ నీలసరస్వత్యైస్వాహా

ఈ దేవత వామమార్గశక్తి

బ్రహ్మోఋషిః గాయత్రీ ఛందః ॥ నీలసరస్వతీ దేవతా ధ్యానం –ఘంటాంశిరః శూలమసిం కరాబ్జైఃదధతంభజే

పోథయంతీం పాదతలే పశుంచంద్ర కళాధరమ్ వాదప్రతి వాదములలో జయమును కలిగించును.

**మరొక మంత్రం :-**

"ఓం హ్రీం శ్రీమదేకజటే నీలసరస్వతి మహోగ్రతారేదేవి
ఖేఖః సర్వభూతపిశాచ రాక్షసాన్ గ్రసగ్రస మమ
జాడ్యం ఛేదయఛేదయ శ్రీం హ్రీంఫట్ స్వాహా ॥

**మరొక మంత్రం :-**

"ఓం హ్రీం శ్రీమదేకజటే నీలసరస్వతి మహోగ్రతారేదేవి
ఖేఖః సర్వభూతపిశాచ రాక్షసాన్ గ్రసగ్రస మమ
జాడ్యం ఛేదయఛేదయ శ్రీం హ్రీంఫట్ స్వాహా ॥

**మరొక మంత్రం :-** "త్రిపురభైరవీ హ్రీం శ్రీం హుం

**వేరొక మంత్రం :-** బ్లూంపం వదవద త్రీంహుం ఫట్ ॥

**4. ఘుటసరస్వతి మంత్రం :-** వామాచారమతం. హ్రీక్లీం బ్లూంసః గ్రీం ఘుటసరస్వతి ఘుటేవదవద తురతుర రుద్రాజ్ఞయా మమాభిలాషం కురుకురుస్వాహా ।

**5. కినిసరస్వతీ మంత్రం :-** 'ఐం హైం హ్రీం కినికిని విద్యే" (నవార్ణం) చాముండా మంత్రంవలె జపన్యాసాదులు.

6. అంతరిక్ష సరస్వతీ మంత్రం :-

ఐం హ్రీం అంతరిక్ష సరస్వతీ స్వాహా ॥

1 లక్ష జపంచేస్తే – దూరశ్రవణశక్తి కలుగుతుంది.



# త్రికూట సరస్వతి

**మంత్రం :-** శ్రీం హ్రీం క్లీం

భృగుః ఋషిః నిచృత్ గాయత్రీ ఛందః లోకేశ దేవతా.

మూలమంత్రం ద్విరావృత్తి న్యాసములు.

**ధ్యానం :- సువర్ణజః కల్పతరుః మణికుట్టిమ భూమిగః**
**తస్యాధస్తాత్ రత్నమయే స్థితాం సింహాసనోపరి ।**
**శ్వేతపద్మే సమాసీనాం మణికుండల భూషితాం**
**కేయూరహార మకుటరసనానూపురాన్వితాం ॥**
**పద్మద్వయం పాశవరౌ చాంకుశేక్షుశరాసనే**
**అభీతిం పుష్పబాణాంశ్చదధానాంకర పల్లవైః**
**హేమాభాం సప్తదూతీభిః సమావృతాః**
**చామరాదర్శకరక తాంబూలాకర చారుభిః**

12లక్షలు జపిస్తే మంత్రసిద్ధి. త్రిమధురములు హోమం చేయాలి. మోదుగుల హోమంవల్ల కవితాసిద్ధి. జపాకుసుమహోమం వల్ల సమస్త జనవశీకరణం. రాజవృక్ష సమిధలు (రేలచెట్టు) హోమం చేస్తే కోరినవ్యక్తి ఆకర్షితుడవుతాడు. వీటికి 12వేలు జపం చేయాలి. బిల్వహోమంవల్ల సంపదవృద్ధి.

# రుద్ర విశ్వేశ్వరి

మంత్రం–ఓం వాం శ్రీం హ్రీం స్ఫ్రేం సౌం స్వాహా। త్రివిక్రమ ఋషిః గాయత్రీ ఛందః ॥

# రుద్ర వాగేశ్వరి

మంత్రం–సర్వజ్ఞామృత తేజోజ్వాలామాలినితృప్తా వదవద అనాదిబోధ వజ్రిణే వజ్రధారయ స్వతంత్ర నిత్యలుప్తశక్తి సహజాతి రూపిణీ అనంతశక్తి బలిం హుంఫట్ పాశుపతాస్త్రాయ సహస్రాక్షాయ స్వాహా। 70 అక్షరములు

**ధ్యానం :-** **శుభ్రాభాం తీక్షణాం దోర్భిబిభ్రతీ ఫలంపుస్తకే ।**
**వరాభయే సర్వభూషాం రుద్రవాగేశ్వరీం భజే ॥**

జపం వల్ల సర్వకామములు సిద్ధిస్తాయి.

# విష్ణు వాగేశ్వరి

మంత్రం–ఓం శ్రీం స్ఫుం శ్రీం నమః

కశ్యప ఋషిః గాయత్రీ ఛందః విష్ణువాగేశ్వరీదేవి శ్రీం శక్తిః స్ఫుం బీజం ।

# పద్మావతీ మంత్రం

మంత్రం–హ్రీం పద్మావతీ స్వాహా

బ్రహ్మఋషి॥ గాయత్రీ ఛందః పద్మావతి దేవతా॥

**ధ్యానం :-** **రక్తోత్పల కరద్వంద్వాం పద్మస్థాం కమలాసనాం**
**బంధూకాభాంత్రి నయనాం నానాకల్పో జ్జ్వలాంస్మరేత్**

శక్తి పీఠములందు 1 లక్షజపంవల్ల సిద్ధి.

# అశ్వారూఢ దేవి

మంత్రం–హ్రీం పరమేశ్వరీ స్వాహా ॥

బ్రహ్మఋషి॥ విరాట్ ఛందః ॥



**ధ్యానం :- అశ్వారూఢాం చంద్రభాలాంత్ర్యక్షాంపాశేన సాధ్యకం**
**బధ్వానయంతీ వామేనదక్షే కనక వేత్రికామ్॥**

శక్తిపీఠమందు 10వేలు జపంవల్ల సిద్ధి. వశీకరణసిద్ధి. ఆజ్యాన్నం హోమం.

# బాలామంత్రములు

త్రిపుర బాలికామంత్రం–ఐంక్లీంసౌః సౌఃక్లీంఐం । దక్షిణామూర్తి ఋషిః గాయత్రీ ఛందః ॥

**ధ్యానం :- పాశాంకుశౌ పుస్తకాక్షసూత్రే చదధతీకరైః**
**రక్తాత్ర్యక్ష చంద్రభాలా ధ్యేయాభాలాసురార్చితా**

1 లక్ష జపం వల్ల సిద్ధి.

మరొక మంత్రం–1. ఐంక్లీంసౌం బాలాత్రిపురేస్వాహా 2. క్లీం హ్రీం ఐం బాలేత్రిపురే సిద్ధిందేహి నమః 3. హ్రీం శ్రీం క్లీం త్రిపురభారతి కవిత్వం దేహి స్వాహా ॥

4. హ్రీం హ్రీం హ్రీం ప్రౌఢత్రిపురే ఆరోగ్యమైశ్వర్యం దేహిస్వాహా।

5. హ్రీం శ్రీం క్లీంపరాత్పరే త్రిపురే సర్వమీప్సితం సాధయస్వాహా ।

6. క్లీం క్లీం శ్రీం హ్రీం హ్రీం త్రిపురే లలితే మదీప్సితాం యోషితం దేహి వాంఛితం కురుస్వాహా ॥

# శక్తిమంత్రం

మనుః– ఆం శ్రీం హ్రీం క్లీంక్లీం హ్రీం శ్రీం అం ఓజో ఋషి॥ గాయత్రీ ఛందః శక్తిదేవతా స్త్రీవశ్యాకర్షణాదుల యందు వినియోగం. దీర్ఘ మాయాబీజములతో న్యాసములు.

**ధ్యానం :- ఆనందరూపిణీం దేవీం పాశాంకుశధనుః శరాన్ ।**
**బిభ్రతీందోర్భిరురుణాం కుచాఢ్యాం హృదిభావయేత్**

8లక్షలు. శక్తిపీఠములందు జపసిద్ధి. ఆజ్యతిలలు హోమం.

నిత్యక్లిన్నామంత్రం, నిత్యక్లిన్నేమదద్రవే నమః ॥ అత్రిరుషిః త్రిష్టుప్ ఛందః ॥

1 లక్ష జపంవల్ల సిద్ధి. దరిద్రబాధ తీర్చును.

వహ్ని వాసినీ మంత్రం, ఓమ హ్రీం వహ్నివాసిన్యై నమః । వశిష్ఠరుషిః గాయత్రీ ఛందః

**ధ్యానం :- తప్తకాంచన సంకాశాం నవయౌవన**
**చారుస్మేరముఖాంభోజాం విలసన్నయనత్రయామ్ ॥**
**అష్టభిర్బాహుభిర్యుక్తాం మాణిక్యాభరణోజ్వాలాం**
**వామహస్తేషు రత్నాబ్జం శంఖం పుంద్రేక్షుజంధనుః**
**గ్లౌంమండలం దక్షిణేషు కహ్లారం హేమశృంగకం**
**పుష్పేషుంమాతులుంగం చ స్వసమాన సఖీవృతాం**
**1లక్ష జపంచేయాలి. ఆజ్యహోమం.**

**అన్నపూర్ణేశ్వరీ మంత్రం :-**

ఓం శ్రీం హ్రీం క్లీం నమోభగవతి మహేశ్వరి అన్నపూర్ణే స్వాహా ॥ బ్రహ్మరుషిః త్రిష్టుప్ ఛందః ॥ హ్రీం బీజం శ్రీశక్తిః కీం కీలకం.

దీర్ఘహృల్లేఖా బీజముతో న్యాసములు.

**ధ్యానం :- తప్తకాంచన సంకాశాం బాలేందుకృతశేఖరాం**
**నవరత్న ప్రభాదీప్త మకుటాం కుంకుమారుణాం ।**
**చిత్రవస్త్ర పరీధానాం మీనాక్షీం కమలస్తనీం**
**నృత్యంత మీశమనిశంధృష్ట్వానంద మయీంపరాం**
**సానందముఖలోలాక్షిం మేఖలాఢ్య నితంబనీం**



అన్నదాన రతాంనిత్యాం భూమిశ్రీభ్యాం నమస్కృతాం
దుగ్ధాన్న భరితంపాత్రం సరత్నం వామహస్తకే
దక్షిణేతు కరేదేవ్యాః దేవీధ్యాయేత్సువర్ణజామ్ ॥
లక్ష జపంవల్ల సిద్ధి.

# గౌరి మంత్రం

మంత్రం-'హ్రీం గౌరి-రుద్రదయితే యోగీశ్వరి హుంఫట్ స్వాహా। ఓజోఋషిః॥ అనుష్టుప్ ఛందః॥ గౌరీదేవతా ॥

హ్రీంకారముతో షడంగన్యాసం

**ధ్యానం :- హేమాభాంబిభ్రతీందోర్భిర్దర్పణాం జనసాధనే**
**పాశాంకుశౌ సర్వభూషాం తాంగౌరీం సర్వదాస్మరేత్॥**

శక్తిపీఠములందు 1 లక్ష జపం వల్ల సిద్ధి. ఎడమకన్ను కాటుకచేత ఎడమతొడయందు మంత్రం లిఖించి, ఆచ్ఛాదించి తద్గతమనస్సుతో 1లక్ష జపంచేస్తే ఆకర్షితురాలవుతుంది.

# అపరాజితా వైష్ణవీ

మంత్రం-ఓం ఆకర్షిణి ఆవేశిని జ్వాలామాలిని
రమణి రామణి-ధరణి ధారిణే-తపనీ తాపినీ-
మదోన్మాదినీ-శోషిణీ-సమ్మోహినీ-నీలపతాకే
మహానీలే మహాప్రియే మహాగ్నేయి మహాచండే
మహారౌద్రి మహావజ్రిణి ఆదిత్యా ద్యే జాహ్నవి
యమఘంటే కిలికిలి చింతామణి సురభిసురోత్పన్నే
సరస్వతి సర్వకామదుఘే మమమనీషితం కార్యం
మమ సిధ్యతుస్వాహా ॥

# అసిద్ధ సాధిని

మంత్రం–ఓంఓంఓం ఓంఓంఓం భూర్భువస్సువః
యతఏవాగతం పాపంతత్రైవ ప్రతిగచ్ఛతు ఓంబలే
అబలే మహాబలే అసిద్ధసాధిని స్వధా స్వాహాస్వాహా
స్వాహా స్వాహా స్వాహా స్వాహా ॥

1 లక్ష జపసిద్ధి.

వార్తాళికా మంత్రం–ఐంలౌం ఠంఠంఠం హుంస్వాహా॥ కపిల రుషిః॥ అనుష్టుప్ ఛందః వార్తాళికా వారాహీ దేవతా ॥

3లక్షలు జప బిల్వపత్ర హోమం.

# వారాహి మాలామంత్రం

మంత్రం – "ఓం ఐం గ్లౌం ఐం నమో భగవతి వారాహివారాహి
వరాహముఖి ఐం గ్లౌం ఐం అంధే అంధిని నమో
రుంధే రుంధీని నమో జృంభే జృంభిణి నమో
మోహేమోహిని నమో స్తంభే స్తంభిని నమో
ఐం గ్లౌం ఐం సర్వదుష్ట ప్రదుష్టానాం సర్వేషాం
సర్వవాగ్‌చిత్త చక్షుర్ముఖ గళజిహ్వాస్తంభం
కురుకురు శీఘ్రం వశ్యం కురుకురు ఐంగ్లౌం ఐం
ఠఠఠఠ హుంఫట్ స్వాహా ॥

దీనినే 'వేదరుద్రాక్షర' మంత్రం అంటారు. చాలా శక్తి వంతమైనది.

**శివోరుషిః జగతీ ఛందః॥ వార్తాళికా దేవతా**

ధ్యానం అనుష్ఠాన విధానములు విపులముగా మూలగ్రంధము నుండి గ్రహించవలయును. యోగిని–గణపతి. బటుకభైరవ–క్షేత్ర పాలకులకు బలిసమర్పించి జపహోమాలు ఆచరించాలి.



# బగళాముఖీ

మంత్రం–ఓం హ్రీం బగళాముఖి సర్వదుష్టానాం వాచం ముఖం స్తంభయ జిహ్వాం కీలయబుద్ధిం వినాశయ హ్రీం ఓం స్వాహా ॥

నారాయణ రుషిః త్రిష్టుప్ ఛందఃబగళాముఖీ దేవతా

❖ బగళా–చిన్నమస్తా, ఇవి మహోగ్రవిద్యలు గురుముఖముగా గ్రహించి, అనుష్ఠించాలి.

## తారా

ఈమంత్రం బలిచక్రవర్తి ఉపాసన చేశాడు.

మంత్రం–ఓం త్రీం హ్రీం హ్రూం హ్రీం హుంఫట్ బ్రహ్మారుషిః గాయత్రీ ఛందః తారాదేవతా.

ధ్యానం–శ్వేతాంబరాం చంద్రకాంతి చంద్రార్థ కృత శేఖరాం ॥

కర్తరీంచ కపాలంచ కరాభ్యాందధతీం భజే ॥

వశ్యకర్మయందు రక్తాంబరాం అని, స్తంభన కర్మ యందు స్వర్ణనిభాం–మారణే అసితాంబరాం–ఉచ్చాటనే ధూమ్రవర్ణాం. శాంతికర్మలయందు శ్వేతాంబరాం–అని భావించాలి.

**❖ తారకాసురుడు ఉపాసించిన మంత్రం**

ఐం హ్రీం శ్రీం క్లీం హ్సౌః ఉగ్రతారే హుంఫట్

**❖ హిరణ్యకశిపుడు జపించిన మంత్రం ❖**

ఓం హుం హ్రీం హ్రౌం క్లీంసౌః హుంఫట్

# రావణబ్రహ్మకు శివుడిచ్చిన మంత్రం

ఓం హ్రీం హ్రూం హ్రౌం హుం ఫట్ ॥ శివరుషిః గాయత్రీ ఛందః తారాదేవతా ॥

# దక్షిణ కాళి

మంత్రం-క్రీంక్రీం హుం హుం హ్రీంహ్రీం దక్షిణే కాళికే క్రీం క్రీంక్రీం హుంహుం హ్రీంహ్రీం స్వాహా॥ భైరవ రుషిః॥ త్రిష్టుప్ ఛందః కాళికాదేవీ దేవతా ॥ హ్రీం బీజం॥ హుః శక్తిః.

పగలు హవిస్సుభుజిస్తూ తెల్లబట్టలు ధరించి శుచిగా ఉండాలి. రాత్రి అశుచిగా ఉండాలి. 1లక్ష జపం. ఉచ్చాటనకు తప్ప సర్వత్ర సురతం మతం. రాత్రియందు నగ్నంగా పరుండి జపించాలి.

# భద్రకాళి

మంత్రం-హ్రౌంకాళీ మహాకాళీ కిణికిణి ఫట్‌స్వాహా రోజూ 108 సార్లు జపించాలి.

# త్రైలోక్య విజయ

మనుః-ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక మాసిక ద్విమాసిక వాతికపైత్తిక శ్లైష్మిక సాన్నిపాతిక సంతతజ్వర సంభవ విషజ్వర గ్రహఋక్షాది సర్వదోషాంతకారిణీ, కాళీసరసర గౌరీ ధమధమ, విద్యాశాలే తాలమాలే రుద్రరూపే పచపచ విఘ్నం నాశయ పాపంహర దుఃస్వప్న వినాశిని కమలాసనే రజనీసంధ్యే దుందుభినాదే, మానసవేగే శంఖిణి. చక్రిణి, వజ్రిణే, గదిని, శూలిని, అపమృత్యువినాశిని విశ్వేశ్వరీ ద్రావిడి. ద్రవిడకేశే, పశుపతిదయతే, మమదుఃఖవిమర్దిని, మోదశర్వ రి, కిరాతిని, మాతంగీ ఓం హ్రీం క్షం క్షాం కురుకురు, యేమాం ప్రత్యక్షం ద్విషంతి. యేమాం పరోక్షం ద్విషంతి తాన్సర్వాన్ హనహన, దమదమ. పచపచ, మర్దయ మర్దయ, తాపమ తాపయ, శోషయ శోషయ ఉత్సాదయ, ఉత్సాదయ, బ్రహ్మాణి, మహేశ్వరి, వారాహీ, వైనాయకీ, ఐంద్రీ, ఆగ్నేయీ. చాముండీ. వారుణి వాయవి రక్షరక్ష,



చండే, చంద్రోపేంద్ర భగిని జయే-విజయే, శాంతి స్వస్తి పుష్టిధృతివివర్ధిని, కాముకి కామదుఘే సర్వకామ ఫలప్రదే సర్వభూతేషుమాం ప్రియం కురుకురు స్వాహా ॥

# ప్రత్యంగిరా మాలామంత్రం

✤ దీనికి మూలం అధర్వణ వేదంలో నున్నది. ఓం హ్రీం నమః కృష్ణవాససేస్తుతే విశ్వసహస్ర హింసిని సహస్రావనే మహాబలే పరాజితే ప్రత్యంగిరే పరసైన్యపర కర్మ విధ్వంసిని. పరమంత్రోత్సాదిని. సర్వభూతదమని, సర్వదేవాన్ బంధబంధ, సర్వవిద్యాం ఛింధి ఛింధి, క్షోభయ క్షోభయ, పరయంత్రాణి స్ఫోటయ స్ఫోటయ, సర్వ శృంఖలాం త్రోటయత్రోటయ కరాళవదనే జ్వలజ్వలాజిహ్వే ప్రత్యంగిరే హ్రీం నమః॥

బ్రహ్మఋషిః ॥ అనుష్టుబ్ ఛందః ప్రత్యంగిరా దేవతా ॥

ధ్యానం-సింహారూఢాతి కృష్ణాంగీ జ్వాలావస్త్రా భయంకరా॥

శూలవస్త్ర కరాఖడ్గం దధతీయాతు తాంభజే ॥

10 వేలు జపిస్తే సిద్ధి. తిలహోమం. ప్రయోగంలో 100 జపిస్తే చాలు.

గ్రహభూత అరిష్టములు, ఇతరులు చేసినప్రయోగములు అన్నియూ నశించును.

# ప్రత్యంగిరా

1. యాం కల్పయంతినోరయః క్రూరాంకృత్యాం వధూమివ ।
   తాంబ్రహ్మణా అపనిర్ణుఘ్నః ప్రత్యక్కర్తారమృచ్ఛతు
   బ్రహ్మఋషిః అనుష్టుప్ ఛందః ॥ ప్రత్యంగిరా
   దేవతా। ఓం ఓజం హ్రీంశక్తిః కృత్యానాశనే
   వినియోగః

ఓం యాంకల్పయంతి నోరయః-హృదయ-అంగుష్ఠ

ఓం క్రూరాం కృత్యాం హ్రీం-శిరసే-తర్జని

ఓం వధూమివ హ్రీం-శిఖాయై-మధ్యమ

ఓం తాం బ్రహ్మణా హ్రీం-కవచాయ-అనామిక

ఓం అపనిర్ణుఘ్నః హ్రీం-నేత్రత్రయాకనిష్టికా

ఓం ప్రత్యక్కర్తారమృచ్ఛతు హ్రీం అస్త్రాయ-కరతల

ధ్యానం- ధ్యాయేత్సింహముఖీం ముక్తకేశాం దిగంబరాం
అసిచర్మ కరాంశ్యామాం దంష్ట్రోగ్రాం సర్వభీషణాం
గ్రసంతీ మహితాన్రుద్రాన్ తేజసా ధ్యానమీరితమ్ ॥

10 వేలు జపం, ఉత్తరేణి సమిధలతో హోమం త్రికోణమందు దేవిని షడ్‌దళములయందు అంగపూజ అష్టదిక్పాలార్చనచేసి ప్రయోగములందు శతజపం. దశదిశల బలిహరణం-మంత్రం, యోమో పూర్వగతః పాప్మాపాపశేనేహ కర్మణా॥ ఇంద్రస్తం దేవరాజా భంజయతు-అంజయతు-మోహయతు-నాశయతు-మారయతు అంతఃబలిం తస్మై ప్రయచ్ఛతు కృతం మమశివం మమశాంతి స్వస్త్యయనంచాస్తు॥ ఇచ్చట ఇంద్రపదస్థానంలో అగ్ని మొ॥ దిక్పాలకుల పేర్లతో బలిహరణం ॥

**2.** ప్రత్యంగిరా రుషిః అనుష్టుప్ ఛందః కృత్యాదేవతా రిపునిగ్రహః

**శ్లో॥ శీర్ణ ణ్వతీం కర్ణవతీం విష్ణురూపాం భయకంరీం ।**
**యఃప్రాహిణో దిహోదృత్వం నిత్యంయోజయ స్వస్తిభిః ॥**

**3. వామదేవ ఋషిః గాయత్రీఛందః కృత్యాదేవతా**

**శ్లో॥ యేనదిష్టేహ వదసి ప్రతిపూరమధాపిని ॥**
**తమేవాతో నివర్తస్వ మాసామ్యత్సో అనాగసః ॥**



**4. వృద్ధవశిష్ఠో ఋషిః ॥ అనుష్టుప్ ఛందః కాలాగ్ని రుద్రోదేవః**

**శ్లో॥ అభివర్తస్వకర్తరి నిరస్తాం తాభిరోజసా ।**
**ఆయురస్య నికృంతస్య ప్రజాశ్చ పురుషాదిని ॥**

**5. ఊర్ధ్వాస్య రుషిః అనుష్టుప్ ఛందః । యాతుధాన్యో దేవతా॥**

**శ్లో॥ యస్త్వావృత్యే చకారేహ త్వంతంగచ్ఛ పునర్నవే**
**ఆసతీః కృత్యనాశాయ సర్వాస్తుయాతుధాన్యః ॥**

ఈ 5 ఋక్కుల సూక్తము చాలా మహిమన్వితమైనది. శుద్ధాష్టమినుండి పూర్ణిమవరకు రోజూ అష్టోత్తర శతజపంచేసి శత్రునామస్మరణతో పురుషప్రమాణంగల మేడికర్ర చేతబట్టినచో, సాధ్యవ్యక్తి అనేకబాధలను పొందగలడు.

**ఋక్॥ క్షిప్రంకృత్యే నివర్తస్వ కర్తురేవ గృహంప్రతి**
**పశూంశ్చైవాస్య నాశయ వీర్యంచాస్య నిబర్హయ ।**
**యస్త్వాంకృత్యే చకారేహ విద్యానపి ఉపగ్రహాన్**
**తస్యైవాతః పరావృత్య తనుంకృంధియధాగరుం! ॥**
**ప్రతిచిత్వావసే ధాతుబ్రహ్మణే విష్ణుమిత్రహం**
**అగ్నిశ్చకృతం రక్షోహా చోజ ఏకపాత్**
**యధాత్వాంగిరసః పూర్వే భృగవశ్చాయసేధిరే**
**అత్రయశ్చవశిష్ఠశ్చ తధైవ నాయసేధిమామ్**
**యస్తేపరూంషి సదధౌరథస్యైపం విభూర్ధియా**
**తంత్రచ్ఛతగతే జననజ్ఞాస్తే జనోయతః ॥**

ఈ అనువాకమును కపిలగోక్షీరంత్రాగి, రోజూ 3 పూట్ల జపించాలి. హవిర్భోజియై, బ్రహ్మచర్య నియమంతో జపించి, 8వేలు పలాశ సమిధలహోమం గోవుదక్షిణ ఇవ్వాలి. వారంరోజులు రోజూ 8వందలు

హోమంచేస్తే ఉపగ్రహముల బాధలు తొలగి శాంతి కలుగుతుంది. నదీతీరమందు–శ్మశానమందు–భద్రకాళి ఆలయమందు జపిస్తే మంచిది. విష్ణుదేవాలయములో రోజూ 108 జపిస్తే మంచిది. విష్ణుదేవాలయములో రోజూ 108 జపిస్తే 6 నెలలలో మనోరథసిద్ధి ఈ 5మంత్రములకు విడిగా రుషి–ఛందస్సులు కలవు. మహా దేవ రుషిః అనుష్టుప్ ఛందః కృత్యదేవతా రిపునిగ్రహే వినియోగః 2. అగ్రస్త్యరుషిః అనుష్టుప్ ఛందః. 3. వశిష్ఠరుషిః అనుష్టుప్ చందః, 4. బ్రహ్మరుషిః–అనుష్టుప్ ఛందః 5. అగ్నిరుషిః, త్రిష్టుప్ ఛందః.

# మంత్ర త్యాగం

తెలిసీ తెలియని జ్ఞానంవల్ల–దురాశవల్ల కొన్ని మంత్రములు గ్రహించినపుడు, అవి అరవణం కుదరకగాని, ఇతర కారణముల చేతగాని సత్‌ఫలితములు ఇవ్వక–దుష్ఫలితములు ఇచ్చినపుడు ఆమంత్రమును వదిలివేయు విధానము చెప్పబడుచున్నది. విద్వాంసుడైనవాడు, తంత్రశాస్త్రము తెలిసినవాడు అయిన బ్రాహ్మణుని వద్దకువెళ్ళి, తనబాధను వివరించి మండలమందు ఘటము స్థాపించి, శుభజలములు నింపి విలోమముగా వెయ్యిహోమంచేసి లేదా 108సార్లు బ్రహ్మార్పణ మంత్రముచేత (ఓం తత్‌సత్ ప్రాణబుద్ధి దేహధర్మాధికార జాగ్రత్‌స్వప్న సుషుప్త్యవస్థాసు, మనసావాచా కర్మణా యత్ స్మృతంయదుక్తం యత్‌కృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేద్భూస్వాహా) తర్పణం చేసి, దిక్పాలకులకు బలిసమర్పణ చేయాలి. ఈ విధంగా ధ్యానంచేసి –

**శ్లో॥ అనుకల్పాదనాలోచ్య మయాతరళ బుద్ధినా**
**ఉపాత్తోదుఃఖదో మంత్రః తద్దోషం వినివర్తయ**
**పాపం ప్రతిహతం మేస్తుభూయాత్ శ్రేయఃసనాతనం**
**తనోతు మమకల్యాణం పావనీ భక్తిరేవతు**



ప్రార్థనచేసి, మంత్రాధిష్ఠాన దేవతను, మంత్రమును యంత్రముపై విలోమముగా లిఖించి కలశముపై నుంచి నమస్కరించి అనంతరం యంత్రమును శిరసుపై కట్టుకొని కలశోదకముతో స్నానం చేయాలి. మరొక ఘటమందు నీరుపోసి, దానిని జలాశయములో వదలాలి.

# దుర్గా సప్తశతి

**శ్లో॥ మార్కండేయ పురాణోక్తం నిత్యంచండీ స్తవంపఠేత్**
**పుటితం మూలమంత్రేణ జపన్నాప్నోతి వాంఛితం**
**కలౌన చండీ సదృశీసిద్ధిదా భువనత్రయే**
**వామదక్షిణమార్గాభ్యామధికారి ఫలప్రదాః**
**తత్రాదిమ చరిత్రంతు రోగనాశాయ యోజయేత్**
**ఉపసర్గ వినాశాయ మధ్యమం యోజయేద్బుధః**
**అంత్య విషయకామస్తు చరిత్రం పరిశీలయేత్**
**చరిత్రద్వయ శీలస్య నవంశఃచ్ఛిద్యతేక్యచిత్ ॥**

**తా :** మార్కండేయ పురాణములోని "దుర్గాసప్తశతి"ని రోజూపఠిస్తే కోరికలు నెరవేరుతాయి. మూలమంత్రముతో సంపుటి చేస్తే శ్రీఘ్రసిద్ధి. కలియుగమందు చండీ నవార్ణ మంత్రమును మించినది 3లోకములలోనూ లేదు. వామ..దక్షిణ రెండువిధములు గానూ ఆచరించవచ్చు. ఇది 3చరిత్రలు కలది. (మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి) ప్రధమచరిత్ర పారాయణవల్ల రోగవిముక్తి. ద్వితీయచరిత్రవల్ల శతృజయం. తృతీయ చరిత్రపారాయణ వల్ల అభీష్టసిద్ధి కలుగుతాయి. 2 చరిత్రలు చదివిన వంశాభివృద్ధి కలుగుతుంది.

# కుబేర మంత్రం

మనుః–యక్షాయ కుబేరాయ వైశ్రవణాయ ధన ధాన్యాధిపతయే ధనధాన్య సమృద్ధిం మేదేహిదాపయ స్వాహా॥ విశ్రవాఋషిః బృహతీ ఛందః.

**ధ్యానం :- గరుత్మనిభం శాంతం మకుటాదివి భూషితం ।**
**వరంగదాంచ దధతం తుందిలం యక్షసేవితమ్ ॥**

1లక్ష జపంవల్ల సిద్ధి-తిలహోమం. శివాలయంలో 10వేలు జపిస్తే ధనవృద్ధి. మారేడు చెట్టుక్రింద కూర్చొని లక్ష జపంచేస్తే ధనలబ్ధి.

# శివదీపం

❖ శివాలయమందు బిల్వపత్ర పాత్రయందు ఆవునేతితో, 12సం॥లు రాత్రీ-పగలూ వెలుగునట్లుగా 'శివదీపం' వెలిగించినచో, ఆవంశమందు ఎన్నటికీ, దరిద్రబాధలేక సంపదలు పొందెదరు. తూర్పుద్వారమందు ధనమును-దక్షిణమున మోక్షమును-పశ్చిమమున వృష్టిని-ఉత్తరమున కామ్యకర్మలను ఇచ్చును.

# సుదర్శన మంత్రం

మను:- ఓం సహస్రార హుంఫట్ ॥

అహిర్ బుధ్నో ఋషిః॥ అనుష్టుప్ ఛందః సుదర్శనో దేవః

సుదర్శనావతారమైన కార్తవీర్యార్జుననిది. 12 లక్షలు జపిస్తే సిద్ధి. తిలలు-త్రిమధురం-ఆవాలు-హోమం, భుక్తి ముక్తిప్రదం.

సుదర్శన గాయత్రి-సుదర్శనాయ విద్మహే మహా
జ్వాలాయధీమహి తన్నశ్చక్రం ప్రచోదయాత్ ॥

12 లక్షల జపంవల్ల సిద్ధి హోమం పూర్వోక్తంలాగే.

# సుదర్శన మాలామంత్రం

ఓం క్లీం సుదర్శన మహాచక్రరాజ దహదహ సర్వదుష్టభయం కురుకురు ఛిందిఛింది-భిందింభింది-విదారయ విదారయ- పరమంత్రాన్ గ్రసగ్రస, భక్షయ భక్షయ-భూతాని త్రాసయ త్రాసయ హుంఫట్ స్వాహా చక్రాయనమః జపానుష్ఠాన విధానం పూర్వోక్తవత్॥



# శైవ మంత్రములు

పంచాక్షరి-ఓం నమశ్శివాయ ప్రణవసహితంగా బ్రాహ్మణులు-రహితంగా ఇతరులు ఉపాసించాలి. భుక్తిముక్తిప్రదం, వామదేవ ఋషిః॥ పంక్తిఛందః సదా శివోదేవః ॥

**ధ్యానం :- నమోస్తు స్థానభూతాయ జ్యోతిర్లింగా మృతాత్మనే**
**చతుర్మూర్తివపుస్థాయ భసితాంగాయ శంభవే**
**చారుచంద్ర కళారాజజ్జటామకుట మండితం**
**పంచవక్త్ర ధరంశంభుం ప్రతివక్త్రం త్రిలోచనం**
**శార్దూల చర్మవసనం రత్నాభరణ భూషితం**
**దక్షోర్ధ్వహస్తేటంకంచ వరంచ దధతంకరైః**
**వామోర్ధ్వహస్తే హరిణం తథానమ భయంపరే**
**సుప్రసన్న ముఖాంభోజం నివిష్టం కుశవిష్టరే**
**బ్రహ్మ-విష్ణు సురేశాద్యైః స్తుతంకృష్ణం సురాసురైః**
**విశ్వాద్యం విశ్వవపుషం భవభీతిహరం భవం ॥**

**తిలాజ్య హోమం :-**

**శ్లో॥ పర్వతే లక్షమేకంతు మహానద్యాం ద్విలక్షకం**
**తీర్థేత్రిలక్షం సంజప్యహునే ద్దూ ర్వాంకురైస్థితైః ॥**

**తా :** పర్వతశిఖరమందు 1లక్ష-మహానదీతీరమందు 2 లక్షలు-తీర్థమునందు 3 లక్షలు జపించి దూర్వాంకురములతో హోమం చేయాలి. పూర్ణాయుర్దాయం, ఆరోగ్యం కలుగుతాయి.

అశ్వత్థవృక్షము స్పృశించి నెమ్మదిగా 2 లక్షలు జపించి మామిడి సమిధలతో హోమంచేస్తే దీర్ఘాయుర్దాయం కలుగుతుంది.

సూర్యునికెదురుగా లక్షజపించి-జిల్లేడు సమిధలతో నిత్యహోమం చేస్తే రోగనాశనం, మోదుగసమిధలతో సమస్తవ్యాధి నాశనం.

కొత్తకుండలో శుభ్రమైన తియ్యనినీరుపోసి, దానిని స్పృశించి 10వేలు జపించి నీటితో స్నానం చేస్తే ఔషధంవలె పనిచేసి ఆరోగ్య సిద్ధి కలుగుతుంది.

భోజనానికి ముందు నిత్యం 28సార్లు పంచాక్షరి జపిస్తే ఆరోగ్యం కలుగుతుంది.

గ్రహణమయములందు నదియందుండి జపంచేసి బ్రాహ్మీరసం (సరస్వతీ ఆకురసం) 1008 జపించి సేవిస్తే, మేధస్సు వృద్ధి చెంది విద్యాభివృద్ధి కలుగుతుంది.

8. జీడిసమిధలతో హోమంవల్ల విద్వేషణ–800 జపంవల్ల అభక్ష్యభక్షణ పాపంపోతోంది. 10లక్షల జపంవల్ల బ్రహ్మహత్యాదోషం పోతుంది.

ఏజాతివాడైనా నిష్ఠగా 5 లక్షలు జపిస్తే మనోనిగ్రహం కలుగుతుంది. నిత్యం సహస్రజపంవల్ల సంపదలు కలుగుతాయి. నిత్యం 2వేలు జపిస్తే ఆరోగ్యసిద్ధి.

# పంచముఖ శివమంత్రములు

**1. సద్యోజాత మంత్రం :-**

సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతవై నమోనమః భవేభవేనాతి భవేభవస్వమాం భవోద్భవాయ నమః ॥ విష్ణుఋషి॥

**2. వామదేవ మంత్రం :-**

ఓం వామదేవాయ నమోజ్యేష్ఠాయ నమోశ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయనమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ నమో బల ప్రమథనాయ నమ స్సర్వభూత దమనాయ నమోమనోన్మనాయ నమః వామదేవఋషిః వికృతిఛందః॥ భర్గోదేవః॥

**3. అఘోర మంత్రం :-**

అఘోరేభ్యోథ ఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః సర్వేభ్యో సర్వశర్వేభ్యో నమస్తేఅస్తురుద్రరూపేభ్యః॥ అగ్నిరుషిః॥ అనుష్టుప్ ఛందః ఆపోదేవః॥



**4. తతర్పురుష మంత్రం :-**

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥

తత్పురుష రుషిః గాయత్రీ ఛందః ఆపోదేవః

**5. ఈశాన మంత్రం :-**

ఓం ఈశానస్సర్వవిద్యానాం ఈశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా శివోమేఅస్తు సదాశివోమ్ ॥

# మృత్యుంజయ మంత్రం

ఓం జూంసః– “కహోద రుషిః॥ గాయత్రీ ఛందః ॥ మృత్యుంజయ మహాదేవో దేవతా ॥

శ్రాంశ్రీంశ్రూశ్రైం శ్రః న్యాసములు.

**ధ్యానం :- స్మరేత్ పద్మద్వయస్థంచ చంద్రార్కాగ్ని**
**త్రిలోచనం**
**హస్తేషు జ్ఞానముద్రాంచ పాశరుద్రాక్ష మాలికే ॥**
**కర్పూరాభం శీర్ష చంద్రం కరోద్గామృతధారయా**
**అర్థాంగం బహుభూషాఢ్యం కాంతిభిశ్చవిమోహితః ॥**

3 లక్షలు జపిస్తే సిద్ధి పాలతో తర్పణం.

# దక్షిణామూర్తి

మంత్రం– ఓం హ్రీం దక్షిణామూర్తయే తుభ్యం పటమూలాధి వాసినే. ధ్యానైక నిరతాంగాయ–నమో రుద్రాయ శంభవే ॥

శుక్ల రుషిః అనుష్టుప్ ఛంధః దక్షిణామూర్తి దేవః ఓం బీజం- హ్రీంశక్తిః.

ఓం-హ్రీం బీజములతో న్యాసములు. 80వేలు జపం తిలలు+క్షీరంతో హోమం. పాయసం లేదా కేవలం ఘృతంతో చేయవచ్చు. అఖిలశాస్త్రములు. జ్ఞానవృద్ధి కలుగుతాయి.

వామాచార విధానంలోని దక్షిణామూర్తిమంత్రం మహాదేవా యహుం వామదేవ రుషిః విరాట్ఛందః వామనాయకో దేవః

క్రాంక్రీం క్రూం క్రైం క్రౌం న్యాసములు.

**ధ్యానం :- లింగన్యస్త మహాకాళిం మదిరాసక్తమానసం**
**లోహదండం మాంసపిండం పానపాత్రం త్రిశూలకం॥**
**దధతం భర్జితం మత్స్యం చషకం రుధిరస్యచ**
**స్పృశంతమే కేనభగం అపరేణ కుచద్వయం**
**ఇత్థం సంచిత్యదేవేశం కాలపీఠే సమర్చయేత్ ॥**

8లక్షలు జపం. మాంసం ముక్కలతో హోమం. సంభోగ సమయంలో 1 లక్ష జపం. 10వేలు హోమం, చందన జలంతో తర్పణం.

# శరభం

మంత్రం-ఓం ఖం ఖాం ఖం ఫట్ శత్రూన్ గ్రససి గ్రససి హుంఫట్ సర్వాస్త్ర సంహరణాయ శరభాయ శాంతాయ పక్షిరాజాయ హుంఫట్ స్వాహానమః ॥

వాసుదేవ రుషిః జగతీఛందః । కాలాగ్నిరుద్రో శరభో దేవతా.

స్వాహాశక్తిః ఖం బీజం ॥

సమస్త మంత్రేణ దిగ్బంధం

**ధ్యానం :- చంద్రార్కాగ్ని త్రినయనం కాళీదుర్గా ద్విపక్షకం**
**విద్యుజ్జిహ్వం వజ్రనఖం బడబాగ్న్యుదరంతథా**



**వ్యాధీమృత్యురిపుఘ్నంచ చండవాతాది వేగినం**
**హృద్భైరవ స్వరూపంచ వైరివృంద నిషూదనం**
**మృగేంద్రత్వచ్ఛకరీరస్య పక్షాభ్యాం చంచునారవః**
**అథోవక్త్రశ్చతుష్పాద ఊర్ధ్వదృష్టిశ్చతుర్భుజః**
**కాలాంత దహనప్రఖ్యో నీలజీమూతనిస్వనః**
**అరయర్దర్శనాదేవ వినష్ట బలవిక్రమాః**
**సహక్షి ప్తగ్రహర్యాయ పక్షవిక్షి ప్త భూభ్రుతే**
**అష్టపాదాయ రుద్రాయ నమః శరభమూర్తయే ॥**

1000 జపం పాయసహోమం. 6 నెలలు రోజూజపిస్తే మంత్రసిద్ధి.

# శరభసాళ్వ మాలామంత్రం

ఓంనమోభగవతే శరభసాళ్వాయ సర్వభూతోచ్చాటనాయ- గ్రహరాక్షస నివారణాయ-జ్వాలాయ మాలా స్వరూపాయ దక్షనిష్కాసనాయ సాక్షాత్కాలరుద్ర స్వరూపాష్టామూర్తయే-కృశాను రేతసే-మహాక్రూర భూతోచ్చాటనాయ-అప్రతిశయనాయ- శత్రూంశ్చనాశయ నాశయ శత్రుపశూన్ గృహ్ణగృహ్ణ ఖాదఖాద-ఓం హుంఫట్స్వాహా ॥

108 అక్షరములు 109 సార్లు జపం. 6 నెలలకు సిద్ధి. మంత్రసిద్ధి అయిన తరువాత స్వచ్ఛమైన నీటిని 7సార్లు అభిమంత్రించి త్రాగిస్తే సర్వగ్రహ-పిశాచ-భూతబాధలు రోగములు నివృత్తి అవుతాయి.

# అఘోరాస్త్రం

మంత్రం-హ్రీం స్ఫురస్ఫుర ప్రస్ఫుర-తరతర-ప్రతర ప్రతర-ప్రచట ప్రచట-కహ-కహ మహ,మహ, బంధబంధ, ఘాతయ ఘాతయ, హుంహుం.

లక్ష జపం-వావిర్భోజనం, జితేంద్రియం ఆజ్య+తిలలతో హోమం.

# ఖడ్గ రావణం

మంత్రం-ఓంనమో భగవతే పశుపతయే
ఓంనమో భూతాధిపతయే ఓం నమో రుద్రాయ
ఖడ్గరావణ లంలం విహరవిహర, సరసర
నృత్యనృత్య-వ్యసన భస్మార్చిత శరీరాయ,
ఘంటాకపాల మాలాధారాయ వ్యాఘ్రచర్మపరి
ధానాయ శశాంకకృత శేఖరాయ, కృష్ణసర్ప
యజ్ఞోపవీతినే, చలచల, బలబల, అతివర్తి కపాలినే
జహిజహి, భూతాన్ నాశయనాశయ మండల ఫట్
ఫట్, రుద్రాంకుశేన శమయశమయ, ప్రవేశయ
ప్రవేశయ, ఆవేశయ ఆవేశయ రక్షాంసి ధరాధిపతి
రుద్రో ఆజ్ఞాపయతి స్వాహా ॥

రావణ ఋషిః ॥ అమిత ఛందః ॥ ఖడ్గరావణో దేవతాః ఖాం ఖీం ఖూం ఖైం ఖౌం ఖః న్యాసములు.

20 వేలు జపం. ఘృత-పాయసహోమం. భూతోచ్చాటనకు చాలా ప్రశస్తమైనది.

# మృత సంజీవని

మంత్రం-ఓం భూర్భువస్సువః హౌం ఓం జూసః త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం। ఉర్వారుక మివబంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥ వశిష్ఠరుషిః అనుష్టుప్ ఛందః ॥ రుద్రోదేవతా ॥ ఓం ఓజం హౌం శక్తిః ॥

బ్రాహ్మణులు కానివారికి మంత్రం-ఓంనమో భగవతే త్ర్యంబకాయ శూలపాణయే రుద్రాయామృత మూర్తయే మాంజీవయ చంద్రజటిల



త్రిపురాంతకాయ హం హ్రీం రుద్రాయ ఋగ్యజుః సామరూపాయ రుద్రాయాగ్నిత్రితయాయ జ్వలజ్వలమాం రక్షరక్ష అఘోరాస్త్రాయ హుంఫట్ స్వాహా ॥

40 వేలు జపసిద్ధి. తర్పణంవల్ల శీఘ్రఫలసిద్ధి.

# రుద్రమంత్రం

❖ ఓం నమోభగవతే రుద్రాయ ॥ (దశాక్షరి) బౌధాయన రుషిః। పంక్తిచందః॥ రుద్రోదేవతా ॥

# భైరవ మంత్రములు

కలియుగమునందు మానవులు శిశ్నోదరపరాయణులు వేదపఠనము వినబడదు. ధర్మశాస్త్రజ్ఞానం ఎక్కడా ఉండదు తిండి- తాగుడు-మైథునం దేశదేశములలోనూ-ప్రతీపురములలోనూ వ్యాపించి యుంటుంది. విష్ణువునుగాని, శివునిగాని, రవినిగాని, గణేశునిగాని ఎవరూ విశ్వసించరు అంతా శాక్తేయులే. భగపూజ చేయువారే.

అపుడు బటుకరూపంలో (చిన్న కుర్రవాడు. 5 సం॥ల బాలుడు "బటుకం పంచవర్షంచ నవవర్షం గణేశకం") బ్రహ్మను తరుణోపాయం గూర్చి నేను (శివుడు) ప్రశ్నించాను అపుడు బ్రహ్మ నాఊర్ధ్వముఖంనుంచి పుట్టిన "ఆగమం" పంచమవేదం. భుక్తిముక్తులను ఇచ్చును. అని చెప్పాడు. అపుడు ఆగమకర్త శివుడు కదా? అని ప్రశ్నించగా నేనే ఆగమకర్తను, రక్షకుడను అనిచెప్పి, కుర్రవాడిని నువ్వు, భక్ష్యపాన అంగనాసౌఖ్యం నీకేమి తెలుసు? అని ఆక్షేపించగా, ధర్మసంస్థాపనార్థం, నాక్రోధ సంరక్తలోచనముల నుండి భైరవుదుద్భవించాడు. నేను కోపముతో బ్రహ్మ శిరమును అనామికా వేలితో ఖండించగా అందునుండి పంచమ వేదమైన ''ఆగమం'' నాలోలీనమైనది నాకు బ్రహ్మహత్యాపాతకం వచ్చినది అపుడు

విష్ణువు–భైరవునికి సాత్విక, రాజస తామస రూపములతో బటుక భైరవునిగా ఆగమమార్గ అధిపతిగా ఆదేశించాడు.

భైరవుడు, సాత్వికరూపంలో కాశీలో ముక్తిమార్గప్రదుడు రాజసరూపంలో యజ్ఞాదికర్మ కక్షకుడై స్వర్గప్రదాత తామసరూపంలో మారణ ఉచ్చాటనకర్త అగుచున్నాడు.

# బటుక భైరవం

మంత్రం–హ్రీం వటుకాయ ఆపదుద్ధరణాయ కురుకురు బటుకాయహ్రీం ॥

బృహదారణ్యక రుషిః ॥ అనుష్టుప్ ఛందః భైరవో దేవతా॥ హ్రీంబీజం॥ ఆంశక్తిః॥ క్రోంకీలకం హవిర్భోజియై జితేంద్రియుడై నిష్ఠగా 21 లక్షలు జపించాలి. తిలహోమం త్రిమధుర తర్పణం.

# బలిదానం

**శ్లో॥ బలిస్తు త్రివిధః ప్రోక్తః సాత్వికో రాజస స్తథా ।**
**తామసశ్చేతి పూర్వోక్తో మాంసహీనోయదా బలిః**
**ముద్గాపాయస సంయుక్తో మధురత్రయలోడితః**
**ఖాద్యైఫలత్రయైర్యుక్తః సాత్త్వికః పరికీర్తితః**
**అయంవిప్రైః ప్రదేయస్తుతేన తుష్యతిభైరవః ॥**

**తా :** 'బలి' 3 రకములు. సాత్త్వికం, రాజసం తామసం. బ్రాహ్మణులు సాత్వికబలినే ఇవ్వాలి అపుడే భైరవుడు సంతోషిస్తాడు. సాత్వికం అంటే పెసరపప్పు–అన్నం పాయసం, 3 తీపిపదార్ధములు, 3 ఫలములు బలినివేదన చేయాలి మాసముతో కూడిన బలిరాజసబలి. ఇది క్షత్రియులకు యోగ్యమైనది. రక్తమాంసములు, మద్యము, మత్స్యముతో కూడినది తామసబలి శూద్రాదిజాతులు ఇవ్వవలయును.



# బందీదేవి

ఈమె ప్రభావం చేతనే భైరవుడు కాశీలో అధికారి అయినాడు.

మంత్రం–ఓం హిలిహిలి బందీదేవ్యై నమః భైరవఋషిః। త్రిష్టుప్ ఛందః ॥ బందీదేవతా మూలమంత్రంతో న్యాసములు.

2 లక్షలు జపసిద్ధి. పాయసాన్న హోమం. కారాగారమున నున్న వారిని విడిపించుటకు, వారి గోత్రనామములతో 10వేలు జపించాలి.

బ్రహ్మచర్య నియమముతో, గణేశుని పూజించి అప్పమునందు నేతితో చతురస్రం లిఖించి మధ్యభాగమున – "ఠ" కారమువ్రాసి, 'పేరు మోచయ' అనివ్రాసి–చుట్టూ 8 మూలలందు 'హ్రీం' కారము వ్రాయాలి. అనంతరం 'ఐం హ్రీం శ్రీం బంది పేరు బంధమోక్షం కురుకురు స్వాహా' అనుమంత్రముతో వేష్టనచేసి, అప్పమును పూజించి, బంధనములో నున్నవానికిగాని, స్నేహితునిగాని ఇచ్చి, పరిశుభ్రంగా తినిపించాలి. వెంటనే అభీష్టసిద్ధి కలుగుతుంది.

# హనుమన్మాలా మంత్రం

ఓం ఐం శ్రీం హ్రీం హ్రీం హ్రూం ఓం నమో హనుమతే ప్రకట పరాక్రమాక్రాంత దింగ్మండల యశోవితాన ధవళీకృత జగత్రియ వజ్రదేహ. జ్వలదగ్ని సూర్యకోటిసమప్రభత నూరుహ, రుద్రావతార, లంకాపురీదహన, ఉదధిలంఘన, దశశిరః కృతాంతక, సీతాశ్వాసన వాయుసుత అంజనీగర్భ సంభూత శ్రీరామలక్షణానందకద కపిసైన్య ప్రాకృతి సుగ్రీవసఖ్యకారిణే వాలినిబర్హణకారణ, ద్రోణ పర్వతోత్పాటన అశోకవనదారణ అక్ష కుమారచ్ఛేదహన రక్షోవన సమూహ విభేదన బ్రహ్మాస్త్ర బ్రహ్మశక్తిగ్రహ ముక్త్వా లక్షణశక్తిభేద విదారణ విశల్యోషధీ సమానయన, బాలభానుమండల

గ్రసనోగ్రమేఘనాద హోమ విధ్వంసన, ఇంద్రజిద్వధకారిణే సీతారంజక రాక్షసీసంఘు విదారణ. కుంభకర్ణాదివధ కృత్పరాయణ, సముద్ర వోయమసముల్లంఘున మహాసామర్థ్య మహాతేజఃపుంజ విరాజమాన, స్వామివచన సంపాదితార్జన సంయుగసహాయ కుమారగ్రహాదీన్ భీషయ శబ్దోదయ దక్షిణాశామార్తాండ మేరుసర్వతవీధికాచల సకల మంత్రాగమాచార్య మమసర్వగ్రహవినాశన, సర్వవిఘ్నునాశన, సర్వాపత్తినివారణ సర్వదుష్టనిబర్హణ సర్వవ్యాఘ్రభయ నివారణ, సర్వశత్రుచ్ఛేదన మమపరస్యత్రియుగ నపుంసస్త్రీ నపుంసకాత్మకం సర్వజీవం వశమానయ వశమానయ, మమాజ్ఞాకారకం సంపాదయ సంపాదయ నానామునిధ్యేయ సర్వమమ పరివారాన్ సేనకాన్ కురుకురు సర్వశస్త్రాస్త్ర విషాన్ విధ్వంసయ విధ్వంసయ హ్రాం హ్రాం హ్రాం హాహాహా పాహిపాహి హుం హ్రీంహ్రీం శ్రీం ఐం ఓం సర్వశత్రుహర పరవృత్త పరసైన్యానిక్షోభయక్షోభయ సర్వకార్యజాతం సాధయ సాధయ, సర్వదుష్టదుర్జన ముఖ్యాని కీలయ-కీలయ యంయంయం హ్రాంహ్రాంహ్రాం హ్రీం హ్రీం హ్రీం హుంఫట్ హుంఫట్ స్వాహా॥ ఈశ్వరరుషిః అనుష్టుప్ ఛందః ॥ అంజనీసుతోదేవతా ॥

# కార్తవీర్జార్యునం

పోయినడబ్బు, వస్తువులు తిరిగి లభింపచేయు కార్త వీర్యార్జున మంత్రం-నమోభగవతే శ్రీ కార్తవీర్యార్జునాయ సర్వదుష్టాంతకాయ తపోబలపరాక్రమైః పరిపాలిత సప్త ద్వీపాయ సర్వరాజన్య చూడామణయే సర్వశక్తిమతే సహస్రబాహమే హుంఫట్ ॥

కార్తవీర్యార్జున గాయత్రి-కార్తవీర్యాయవిద్మహే మహావీర్యాయ ధీమహి తన్నో అర్జునః ప్రచోదయాత్ ॥



# విశేషాంశములు

1. సూర్యుడు సింహరాశిలో సంచరించినపుడు ఆ నెలలో పూర్ణిమయందు స్వగృహములో వాస్తుపురుషుని పూజించినచో గృహమునకు వాస్తుబలము పెరుగును. అందు నివసించువారికి భూత-ప్రేత బాధలు-రోగభయములు ఉండవు.

2. ఒకే పీఠమందున్న వివిధదేవతలకు విడివిడిగా పూజ చేయ వలయును వీటికి చందన, పుష్ప ధూప-దీప, నైవేద్యములు వేరువేరుగా నుండవలయును. ఒకే నైవేద్యము అన్ని దేవతలకు నివేదన చేయరాదు. గణేశ-సూర్య-విష్ణు-ఈశ్వర-పరదేవతలకు -క్రమానుసారముగా పూజ చేయవలయును. విగ్రహము దేవతా శరీరమైతే, మంత్రము ప్రాణశక్తి అగుచున్నది.

**శ్లో॥ శివలింగే, మణౌ, యంత్రే, శాలగ్రామే, ఘటే రవౌ**
**స్థండిలేగ్నౌ. మూర్ధ్ని, హృది-స్థానేష్వేతేషు పూజయేత్ ॥**

**తా :** శివలింగము, మణి- యంత్రము, సాలగ్రామం, కుండ-సూర్యుడు-స్థండిలం, అగ్ని, శిరస్సు, హృదయం, ఈ పది భగవంతుని స్థానములు కనుక పూజనీయములు. భూమిపై పీఠము లేకుండా అర్చన చేయరాదు.

# సాలగ్రామములు

3. గండకీ నదీతీరమందు ఈ సాలగ్రామ శిలలు లభిస్తాయి. ఇవి విష్ణుస్వరూపములు. కీటకములు ఇచ్చట శిలలనుతొలచి వివిధాకృతులుగా చేయును. ఇవి వివిధ శుభాశుభ ఫలితముల నిచ్చును స్నిగ్ధముగానున్నది మంత్రసిద్ధి కలిగించును. రూక్షముగా నున్నచో సిద్ధిభంగం తెలుపు వర్ణం కలది పాపములు పోగొట్టును. పసుపువర్ణం కలది పుత్ర సంతానమిచ్చును.

ఎరుపువర్ణం సంతానసష్టం. నీలవర్ణం ధనప్రదం, బూడిదరంగు మతిచాంచల్యం. రక్తవర్ణం రోగప్రదం, వక్రముగానున్నది దరిద్రం. సమముగానున్నది సర్వార్ధ సాధిక బరుపుగా నున్నది ఆయుఃక్షీణం. తేలికగా చిన్నదిగానున్నది బుద్ధివివర్ధనం.

పుట్టుమచ్చలుంటే సత్ఫలం. కపిలవర్ణం చిత్తచాంచల్యం, చిత్రవర్ణం కలది నేత్రరోగం. చక్రచిహ్నము తప్పనిసరిగా ఉండాలి. చక్రం గుర్తులేనిది ఆపదలు కలిగించును రేఖావర్తం పనికిరాదు దుఃఖప్రదం. పద్మం-చక్రం రెండూ ఉంటే లక్ష్మీహరి స్వరూపం. వనమాలా చిహ్నమున్నది గృహస్థులకు మంచిది. 2 చక్రములుంటే వాసుదేవం అంటారు. రెండు దిశలుగా చక్రములుంటే సంకర్షణ సాలగ్రామం చిన్న చక్రం ఉంటే ప్రద్యుమ్నం. పచ్చగావుండి ఎక్కువ ఛిద్రములుండి లోపల రంధ్రమున్నచో ఇష్టసిద్ధి కలిగించును. నీలవర్ణంలో వర్తులమున్నచో అనిరుద్ధం. 2గీతలుండి పద్మలాంఛన మున్నచో కేశవస్వరూపం, మధ్యలో ఎత్తుగాఉండి చక్రమున్నచో శ్యామవర్ణమైనచో నారాయణ స్వరూపం. తెల్లగాఉండి మారేడు దళాకారములో నున్నచో పరమేష్ఠీ సాలగ్రామం స్థూలచక్రం ఉండి నల్లగాఉన్నచో విష్ణు స్వరూపం. కపిలవర్ణంలోనున్నది నారసింహం. ఇది బెల్లం, లక్కరంగులో ఉంటుంది. 4చక్రములు 1బిందువు వుంటే లక్ష్మీనృశింహం, కూర్మాకారం-అంకుశాకారం ఉంటే హయగ్రీవం, నువ్వురంగు ఓకచక్రం, 1 జెండా గుర్తుఉన్నచో వైకుంఠం కదంబ కుసుమాకారంలో 5రేఖలుండినట్లయితే వామనం దీనికే 2 చక్రములుంటే దధివామన సాలగ్రామం. అనేక రేఖలతో ఉన్నది సహస్రార్జున సాలగ్రామం. కొంగల పంక్తివలె గుర్తుఉన్నచో నష్టద్రవ్యలాభము కలిగించును. అనేక చక్రములున్నచో సర్వకామ ఫలప్రదం. శిరోగత లింగచిహ్నమున్నచో యోగీశ్వర సాలగ్రామం.



బ్రహ్మహత్యాది పాపములు పోగొట్టి యోగసిద్ధినిచ్చును. పద్మం-ఛత్రం గుర్తులుంటే పద్మనాభం. దీనిని తులసీదళములచే పూజిస్తే ఎంతదరిద్రుడైనా ధనవంతుడవుతాడు. పక్షిరెక్కలవలె గుర్తులుంటే గరుడం, సర్వవిషనాశకం, లింగాకారం చిహ్నంవుంటే శివసాలగ్రామం. మంత్రసిద్ధిప్రదం. జటలవలె రేఖలుంటే ధూర్జటి. 3 రేఖలుంటే జ్ఞానప్రదం. తెల్లటిది శంభుసాలగ్రామం. శిరస్సుపై నల్లమచ్చ ఉంటే, బిల్లప్రమాణమైనచో స్త్రీవశంకరం. ఎర్ర బిందువువుంటే ఈశ్వరం. గోపదం ఉంటే మృత్యుంజయం. అపమృత్యు నివారణం. అర్ధచంద్రరేఖ ఉంటే చంద్రశేఖరం. ఇది రోగనాశకం, అన్ని సాలగ్రామములకు చక్రంసామాన్య లక్షణం. ఇతర గుర్తులవల్ల విశేషత్వం వస్తుంది. నిష్ఠచాలా అవసరం. నిత్యం సాలగ్రామమునకు మహానివేదన చేయాలి. విశేష శీఘ్రసిద్ధినిస్తుంది. బ్రాహ్మణుల ఇంట్లో తప్పక సాలగ్రామం ఉండాలి. లేదా బాణలింగం ఉండాలి. స్త్రీలు లింగాభిషేకం చేయరాదు పూలతో పూజ చేయవచ్చు.

# తర్పణములు

4. అంగుష్ఠం భైరవస్థానం, అనామిక చండక-ఈ రెండువేళ్ళతో జలతర్పణం వారికి చాలా ప్రీతికరం. అంగుష్ఠ మధ్యమవేళ్ళతో తర్పణం వశ్యకర్మలలో చేయాలి అంగుష్ఠ తర్జనివేళ్ళతో అభిచారకర్మలో తర్పణం చేయాలి. అంగుష్ఠ కనిష్ఠికలతో స్థంభన కర్మను చేయాలి.

5. శివనిర్మాల్య-ప్రసాదములు శైవులు మాత్రమే గ్రహించాలి ఇతరులు గ్రహించరాదు. శివాలయమందు గణపతి, సూర్య, విష్ణు, దేవీ ఆలయములు కూడా ఉన్నచో ప్రసాదాదులు గ్రహించవచ్చు. శూద్రులు ప్రతిష్ఠించిన శివలింగమునకు బ్రాహ్మణులు పూజలు చేయరాదు. తత్సంబంధ ప్రసాదాదులు గ్రహించిన పాపులగుదురు.

# లక్ష్మీ మంత్రములు

6. 1–ఓం శ్రీంహ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం హ్రీం శ్రీం మహాలక్ష్మీ నమః॥ గాయత్రీ ఛందః॥ దక్ష ప్రజాపతి మునిః త్రిబీజములతో న్యాసం॥

**ధ్యానం :-** **సింధూరాభాం చ పద్మస్థాం పద్మపత్రంచ దర్పణం ।**
**అర్ఘపాత్రం చదధతీం సద్ధారమకుటాన్వితం ॥**
**నానాదాసీ పరివృతాం కాంచీకుండల మండతాం**
**లావణ్యభూమికాం వందే సుందరాంగద బాహుకాం ॥**

1 లక్ష జపం, బిల్వఫల హోమం. ధనలాభం.

2. సామ్రాజ్య లక్ష్మీమంత్రం–శ్రీం సహకలహ హ్రీ శ్రీం హరిఋషిః ॥ గాయత్రీ ఛందః॥ మోహినీలక్ష్మీ సర్వసామ్రాజ్యదాయినీ దేవతా॥ శ్రీం బీజం–కూటంశక్తిః॥ ఆం ఈం ఊం ఐం ఔం అః షడంగన్యాసములు.

**“అతసీ పుష్పసంకాశం రత్నభూషణ భూషితాం**
**శంఖచక్ర గదాపద్మ శార్‌ఙ్గబాణధరాం కరైః ॥**
**షడ్భిః కరాభ్యాం దేవేశీం వరదాభయశోభితాం**
**పూజయామి జగద్ధాత్రీం బిందుషట్కోణ మేవచ ॥**

3 లక్షలు జపసిద్ధి॥ కమలహోమం.

3–సిద్ధలక్ష్మీ మంత్రం–ఓం శ్రీం నమః సర్వసిద్ధయోగినీభ్యో నమః॥ సర్వసిద్ధ మాతృకాభ్యో నమః నిత్యోదితా నంద నందితాయై సకల కుల చక్రనామికాయైభగవత్యై చండకపాలిన్యై ఓం హ్రీం హ్రుం హ్రాం ఓం క్షాం క్రౌం నమః పరమహంసినీ నిర్వాణమార్గదే దేవి విషమోపప్లవ ప్రశమని సకల దురితారిష్ట క్లేశదలిని. సర్వాపదాంబోధి తారిణి, సకల శత్రువిధ్వంసిని దేవ్యాగచ్ఛ ఆగచ్ఛ హంస హంస బలబల నరరుధిరాం త్రవసాభక్షిణి మమశత్రూన్ మర్దయ మర్దయ ఖాదఖాద త్రిశూలం నో భింధిభింధి ఛింధి



ఛింధి ఖడ్గేణ తాడయ తాడయ ఛేదయ ఛేదయ మమసకల మనోరథాన్ సాధయ సాధయ, పరమకారుణికే భగవతి మహాభైరవ రూపధారిణి త్రిదశవర నమితే, సకలమాతః ప్రణత జనవత్సలే దేవి మహాకాళీ కాలనాశిని హ్రుం హ్రుం హ్రుం ప్రసీద మదనాతు రాం కురుకురు సురాసుర కన్యకాం హ్రీం వసుప్రియా హ్రుం ఫట్‌ఫట్ స్వాహా॥ త్రిలోచనా ఋషిః అతాజగతీ ఛందః ॥ సిద్ధలక్ష్మీ దేవతా శ్రీం బీజం హ్రీం శక్తిః ॥

వామ–దక్షిణ మార్గముల రెండింటియందూ పూజావిధానము కలదు. 4 వేలు జపం గగ్గులు–నేయి హోమం. రావి, మర్రి, మేడిచెట్లను ఆలింగనం చేసుకొని వెయ్యిజపిస్తే గ్రహపీడా నివారణ. జాజి–మారేడు చెట్టను పూజించి 8 వేలు జపిస్తే పదవీయోగం. కస్తూరితో హోమంచేస్తే ఆరోగ్యసిద్ధి పాటలీపుష్ప హోమం, వివాహసిద్ధి జీడిఫలాలతో శత్రువుకు చిత్తచాంచల్యం, బూరుగుతో మారణం– కటుతైలంతో విద్వేషణం, స్థంభనం, గాలికిపడిన ఆకులతో హోమం చేస్తే శత్రూచ్చాటనం జరుగుతాయి. దూర్వచే ఆయుర్వృద్ధి మేడిసమిధలతో పుత్రలాభం, ఉత్తరేణి–తిలాజ్యహోమంవల్ల మహాభయ నివారణం, మారేడు+ఆజ్యతిలతండుల హోమం వల్ల విద్యాలాభం. కుంకుమాగరుకర్పూర గోరోచన మిశ్రమం. 7సార్లు జపించి తిలకంధరిస్తే సర్వవశీకరణం భక్ష్యభోజ్య అన్నహోమంవల్ల సకలసిద్ధులు కలుగుతాయి.

శివార్పణమస్తు